భారతీయ వాఙ్మయ చరిత్ర పరంపరః౧

# గుజరాతీ
# వాఙ్మయ చరిత్రము



కర్త:

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ
డాక్టరు చిలుకూరి నారాయణరావు M. A., P. H. D,

" ఆత్రేయాశ్రమము "
అనంతపురము

# DEDICATION

TO

Sri **K. M. Munshi**

and

Srimati **Lilavati Munshi**

as a mark of admiration for
and appreciation of
their services to Indian Literature in general
and Gujarati literature in particular by a fraternal
worker in the same direction in Andhra.

C. Narayana Rao

పోషకులు:

మహారాజశ్రీ

వేదాంతము

## లక్ష్మీనారాయణ పంతులు గారు

బి. ఏ. బి. ఎల్.

అడ్వొకేటు తెనాలి

# పీఠిక

భారతీయులకు స్వాతంత్ర్యము వచ్చినదికాని భారతీ యైకత్వము సిద్ధించలేదు. అట్టి సిద్ధికి పూర్వము ప్రతిబంధకము లుండేవి ఇప్పుడున్నా ఉన్నవి. అవి తొలగితేగాని స్వాతంత్ర్యము వల్ల లాభము లేదు. ఏకత్వము, సామరస్యము కల్పించేది సంస్కృతి. సరియైన సంస్కృతి సరియైన వాఙ్మయము మూలముగా వ్యక్తమవుతుంది. ఒకొక్క భారతీయ భాషలో ఒకొక్కరీతి వాఙ్మయ ముదయించినది. వివిధ భాషాప్రాంతీయులకు పరస్పర వాఙ్మయముల గూర్చిన పరిచయ మావశ్యకమేకదా ఆ అక్కరను తీర్చడానికి చేసిన ప్రయత్నములలో భరత ఖండమందంతటను చేయబడిన ప్రయత్న మిప్పటివరకు నిది యొక్కటే గుజరాతీ వాఙ్మయ చరిత్ర మిది. దీనిని మొదట ప్రచురించడానికి కారణము యాదృచ్ఛికము. ఇతర భాషా వాఙ్మయ చరిత్రములు వరుసగా ప్రచురిస్తాను. ఆంధ్రుల ఆదరాభిమానములు చూచుకొని. తలచుకొని కార్య పరులయితే ఆంధ్రులు సాధింపలేని దేమున్నది? సాధింతాము. ఇట్టి అభ్యుదయ వాఙ్మయము పోషిస్తే ఇష్టసిద్ధికి కొదువ వుండదు.

అనంతపురము
భారత రిపబ్లిక్ అవతరణ దినము
26–1–1950.

చిలుకూరి నారాయణరావు

## గ్రంథకర్త రచించిన ఇతర గ్రంథములు

(వెంటనే కొరకేవిః)

1. కురానుషరీఫు రు 6లు
2 అశోకునిధర్మశాసనములు రు 2లు
3 సంస్కృత లోకోక్తులు రు 1
5 ఉమార్ ఖయామ్ రుబాయత్ అ 12లు
6 ఉపనిషత్తులు ఈశ కేనకఠ ఐతరేయ పద్యములు అ 8లు

### నాటకములు.

1 అంబ లేక మొండిశిఖండి అ 12లు
2 అశ్వత్థామ అ 8లు
3 అచ్ఛి లేక కాపువలపు అ 8లు
4 పెండ్లి అ 8లు
5 వాడే అ 12లు
6 నాటకనాటకము అ12లు

ఈ సంపుటము వంటివే అచిరకాలములో వెలువడునవి
1. హిందీ 2 బంగాలీ 3 మరాఠీ 4 ఒరియా 5 తెలుగు
6 తమిళము 7 కన్నడము 8.మలయాళము
వాఙ్మయ చరిత్రములు.

# గుజరాతీ వాఙ్మయము

## ప్రథమాధ్యాయము

గుజరాతు దేశము ఒక లక్ష చదరపుమైళ్ళ విస్తీర్ణము కలది. గుజరాతీ భాషను మాట్లాడేవారు ఒక కోటిమంది ఉన్నట్లు 1921 సంవత్సరపు జనాభా ప్రకారము తేలినది. 1931 సం॥ములో సహాయనిరాకరణోద్యమము మూలమున గుజరాతీలు జనాభా లెక్కలు తీసుకొనడములో సహాయపడ లేదు. కాబట్టి ఆ పది సంవత్సరములలో గుజరాతీల జనాభా అభివృద్ధిని గురించి తెలియదు. 1931 నుంచి గడచిన ఎనిమిది సంవత్సరములలోకూడా గుజరాతీల జనసంఖ్య అభివృద్ధి అయి ఉంటుంది. మొత్తముమీద నేడు గుజరాతీ మాట్లాడేవారి సంఖ్య ఒకటిన్నర కోట్లుండవచ్చునని ఊహించవచ్చును. తక్కిన భాషలను మాట్లాడేవారి దేశము వలెనే గుజరాతీ దేశము కూడా ఖండ ఖండములుగా విభజింపబడి వివిధ మండలములకు చేర్చబడినది. గుజరాతీల నందరిని చేర్చి ఒక గుజరాతు రాష్ట్రమును ఏర్పరచిన యెడల వారు సర్వతోముఖాభివృద్ధిని పొందగలరనడానికి సందేహము లేదు. కాని ఆంధ్ర రాష్ట్రముకొరకు ఆంధ్రులు చేస్తూ ఉన్న ఆందోళనము గుజరాతీలలో కనబడదు. వారికి ఏకరాష్ట్రము లేకపోయినా భాషామూలకముగా వారందరున్నూ ఏకజాతీయతను కలిగి ఉన్నారు.

గుజరాతుదేశము సింధురాష్ట్రమునుండి బొంబాయి వరకు వ్యాపించి ఉన్నది. ఆబూ పర్వతమునుండి దమణగంగా నదివరకున్ను గల దేశము నేడు గుజరాతుగా తలంపబడు తున్నది. గుజరాతీ భాషను మాట్లాడేవారిని బట్టి చూస్తే ఆ దేశము ఉత్తరపు ఱెల్ల సిరోవా, మారవాడ దేశములవరకూ వ్యాపిస్తుంది. సింధుదేశములోని థారు, పరాకరు జిల్లాలను, కచ్ఛ మండలమున్ను గుజరాతములోనే చేరుతవి. దక్షిణమున బొంబాయి రాజధానిలో సాల్సెట్టె దీవులు, బొంబాయి కూడా గుజరాతులో చేరవలసి యున్నది. తూర్పున ధర్మపుర సంస్థానము, పాలణపురము, ఆరావలీ గుట్టలు, రాజపుత్ర స్థానపు తూర్పు దక్షిణపు భాగములున్ను చేరి ఉన్నవి.

గుజరాతు దేశమునకు వివిధ కాలములలో వివిధము లైన పేళ్ళుండేవి. ఉత్తరగుజరాతుకు తొలుత ఆనర్తదేశ మని పేరుండేది. రాను రాను దీనికి గుర్జరత్ర, గుర్జరభూమి, గూర్జర మండల లేక గుర్జరదేశము అనే పేళ్లు వచ్చినవి. ఈ ప్రాంతమే సరియైన గుజరాత మని ఉత్తరగుజరాతు జనులు గర్వముతో చెప్పుకొంటారు. దక్షిణగుజరాతుకు తొలుత నాగమండలము అని పేరుండేది. తరువాత దానికి అనూపదేశ మనిన్ని, ఇంకను తరువాతికాలమున శూర్పారకదేశ మనిన్ని పేరు వచ్చినది. ఆ తరువాత నర్మదకు దక్షిణమున బొంబాయివరకు గల గుజ రాతుకు అపరాన్త మని పేరు కలిగినది. అపరాన్తము దక్షిణా పథములో చేరినది. క్రీ. శ. 150 ప్రాంతములలో కంబాత (Canbay)కున్ను, నర్మదకున్ను మధ్యనున్న దేశమునకు లాట

మని సంజ్ఞ ఉండేది. చాళుక్యుల కాలములో ఈ పేరు పోయి దీనికిన్ని గూర్జరభూమి అని పేరు వచ్చినది. కాఠియవాడు దేశమునకు పురాణములలో కుశస్థలము అని పేరు. దీనికే తరువాతి కాలములో సురాష్ట్రము లేక సౌరాష్ట్రము అని పేరు కలిగినది. ఈ సురాష్ట్రము పురాణములలో ఆనర్తదేశములో ఒకభాగముగా వర్ణింపబడినది. కచ్ఛమండలము నేడు రాజకీయముగా ప్రత్యేకముగా ఉన్నా, ఆ దేశవాసులు గుజరాతునే తమ జన్మభూమిగా భావించుకొంటారు.

భారతవర్షములోని ఆర్యభాషలు సంస్కృతముతో సంబంధించినవి. తొలుత దేశభాషలన్నీ ప్రాకృతభాషలుగా ఉండేవి. ఈ ప్రాకృతభాషలు మధ్య దేశభాషలనిన్నీ, వాటికి చుట్టు ఉండే ప్రాకృత భాషలనిన్నీ రెండువిధములుగా ఉండేవి. మధ్యదేశప్రాకృతము సంస్కృతముగా మారినది. ఈసంస్కృత ప్రోద్బలమూలముగా తక్కిన ప్రాకృతములు వివిధములైన అపభ్రంశభాషలుగా మారినవి. ఈ అపభ్రంశభాషలు తొలుత వ్యావహారికరూపమున ఉండేవి వీటిలో కొన్ని వాఙ్మయావస్థను పొందినవి. వాఙ్మయావస్థను పొందిన అపభ్రంశభాషలు కొంతకాలమునకు కావ్యభాషలుగానే నిలిచిపోయినవి. వ్యవహారభాషలు మార్పులు పొందుతూ కావ్యభాషకు దూరములైనవి. అట్టి భాషలలో శౌరసేనీ అపభ్రంశ మొకటి. ఇది వాఙ్మయమున కుపయోగింపబడినది. వ్యవహారములో ఉండు శౌరసేనీ అపభ్రంశము గుజరాతీగా మారినది.

శౌరసేనీ అపభ్రంశమును కావ్యభాషగా ఉపయోగించినవారు జైనులు. జైనులీ భాషను జైనధర్మబోధకములైన కథలను వ్రాయడాని కుపయోగించినారు. ఇట్టి కథలలో 'తరంగలోల' లేక 'తరంగవతి' అనేది ఒకటి. దీనిని వ్రాసినవాడు పాదలిప్తుడు. దీని మూలగ్రంథము నేడు కానరాదు. నేమిచంద్రుడు దీనిలోని కథను 1644 గాథా పద్యములుగా రచించినాడు. దీనిలోని కథ ఇది :—

"మగధదేశములో ఒక జైనభిక్షుని ఒక నగరసెట్టి యింటికి భిక్షకు పోయినది. ఆమె యౌవనవతి, సుందరి. సెట్టి ఆమెను అంతచిన్నతనములో భిక్షుని కావడానికి కారణ మడుగుతాడు. ఆమె తన వృత్తాంతమును చెప్పుతుంది. ఆమె కౌశాంబిలోని నగరసెట్టి కూతురు. భోగములో పెరిగినది. బాగుగా చదువుకొన్నది. సంపెంగపూవువలె చక్కగా ఉండేది. ఒకనాడు ఆమె తోటలోనికి పోగా చక్రవాక పక్షుల జంట కనబడినది. వాటిని చూచి ఆమె మూర్ఛపోయినది. ఆమె చెలికత్తె లామెకు శైత్యోపచారములు చేసి తెలివి వచ్చినతరువాత మూర్ఛకు కారణ మడుగుతారు. తరంగవతి తన పూర్వజన్మ కథను చెప్పుతుంది. ఆమె తన పూర్వజన్మములో చక్రవాకపక్షియై అంగదేశములోని ఒక సరస్సువద్ద తన కాంతునితో ఉండేది. చక్రవాకదంపతులు అతిలోకప్రేమతో ఉండేవారు. ఒకనాడొక కిరాతుడు నీటిలో ఈదుతూ ఉన్న ఒక ఏనుగును బాణముతో కొట్టబోగా, అది గురితప్పి మగపక్షికి తగిలినది. చక్రవాకి దుఃఖమును చూచి కిరాతునుకూడా పశ్చాత్తప్తుడైనాడు. ఆ కిరాతుడు పేర్చిన చితిలో చక్రవాకి దగ్ధమైపోయినది. సరస్సులో సరససల్లాపము లాడుతూ ఉన్న ఆ చక్రవాక మిథునమును చూడగానే ఆమెకు పూర్వజన్మ స్మరణము కలిగినది. పూర్వజన్మములో తన కాంతుడైన చక్రవాకమును కలుసుకోవలెనని ఆమెకు బుద్ధి పుట్టినది. ఎంత ప్రయత్నించినా ఆమె కోరిక సిద్ధించలేదు. తన పూర్వజన్మములో

తాననుభవించిన వృత్తాంతములను చిత్రములుగా వ్రాస్తూ ఉండేది. పూర్వపు చక్రవాకపక్షి ఆ పట్టణములోనే ఒక ధనికుడైన సెట్టికి కొడుకుగా పుట్టినది. అతడా చిత్తరువులను చూచి తన ప్రియురాలైన చక్రవాకిని స్మరించి మూర్ఛపోయినాడు. తరంగవతిన్నీ, సెట్టికొడుకున్నూ కలుసుకొన్నారు. కాని వారి తలిదండ్రులు వారి వివాహమునకొప్పుకొనలేదు. కాబట్టి వారిద్దరున్నూ ఇంటినుండి లేచిపోయి ఒక అడవిని చేరుకొన్నారు. అక్కడ ఒక దొంగలగుంపు వారిపైపడి కాళికి బలిగా ఇవ్వడానికి తీసుకొనిపోయినారు. ఆ దొంగలలో ఒకడు వారి పూర్వకథ విని పూర్వజన్మములో మగపక్షిని చంపినవాడను తానే అని తెలుసుకొని, వారు తప్పించుకొనేటట్లు చేసినాడు. వారా దొంగలగుంపునుంచి పారిపోయి, ఒక పట్టణము చేరుకొన్నారు. అక్కడ వారి వృత్తాంతము తెలిసి వారి తలిదండ్రులు వారికి వివాహము చేసినారు.

ఈ కథ మిక్కిలి అందముగా చెప్పబడినది. దీనిలోని ధర్మబోధ అటుండగా ప్రేమకు చిహ్నములైన చక్రవాకముల వృత్తాంతము చాల మనోహరముగా వర్ణింపబడినది.

ధర్మకథలు వ్రాసినవారిలో హరిభద్రుడు మఱి ఒకడు. ఇతడు 'సమరాయిచ్చ కహా' (సమరాదిత్య కథ) అనే గ్రంథము వ్రాసినాడు.

" గుణసేనుడు ఒక రాజపుత్రుడు. అతని పురోహితుని కొడుకైన అగ్నిశర్మనతడెప్పుడును వెక్కిరిస్తూ ఉండేవాడు. దాని కోర్వలేక అగ్నిశర్మ ఒక జైనసాధువువద్దకు పోయి అతనికి శిష్యుడైనాడు. కొంతకాలమునకు గుణసేనుడు రాజైనాడు. అగ్నిశర్మ గొప్ప సాధువైనాడు. అతడు నెల కొక్కసారె భోజనము చేసే వ్రతమును స్వీకరించి పారణదినమున రాజువద్దకు వస్తానని చెప్పినాడు. ఆ దినమున అగ్నిశర్మ పోగా రాజపరిచారకులు రాజుకు పుత్రోదయము కావడముచేత ఆ సందడిలో సాధువునకు సత్కారమును చేయలేదు.

సాధువు మరలిపోయినాడు. ఆ దినము భోజనము లేకపోయినా తన వ్రతము ప్రకారము మరి ఒక నెల ఉపవాసము చేసినాడు. ఈ సంగతి రాజుకు తెలిసి ఖిన్నుడై తానే పోయి క్షమింపవేడుకొని, మరల ఆతిథ్యమున కాహ్వానించినాడు. సాధువు మరల కోటకు పోగా ఏదో చిన్న కారణమువల్ల వెనుకకు పోవలసివచ్చినది. ఈరీతిగా నాలుగుసార్లు రాజు ఆహ్వానించడమున్ను, సాధువు మరలిపోవడమున్ను సంభవించినది. అగ్నిశర్మకు పట్టరాని కోపమువచ్చి, జన్మజన్మములలోను రాజుమీద పగ దీర్చుకొనడానికి శపథము పూని నిరాహారుడై ప్రాణత్యాగము చేసినాడు. ఆ తరువాత అనేకజన్మము లెత్తి ప్రతి జన్మములోను గుణసేనుని బాధ పెట్టినాడు. తుదకతడు తన క్రోధముచేత తానే దగ్ధుడైనాడు. గుణసేనుడు జన్మజన్మమునకు తనపుణ్య మెక్కువకాగా, తుదకు స్వర్గము చేరుకొన్నాడు.”

జైనధర్మకథలు నానాటికిన్ని కేవల మతబోధకములైన గ్రంథములుగా మారి, కావ్యత్వమును గోల్పోయినవి. ఆగ్రంథములకున్ను, జనుల జీవితములకున్ను సంబంధము తెగిపోయి అవి కేవలము నమ్మరాని అద్భుతకథలుగా మారిపోయినవి.

గుజరాతు దేశములో జన్మించిన ప్రాకృతభాషా విద్వాంసులలో హేమచంద్రుడు డగ్రగణ్యుడు. ఇతడు మహావిద్వాంసుడై అనేక పండితులను వాదములలో ఓడించి, భారతవర్షమునందంతటను ప్రఖ్యాతిని పొందినాడు. అతని శిష్యులు అనేకులు చక్కని ప్రాకృతకావ్యములను వ్రాసినారు. వారిలో రామచంద్రుడనేవాడు వ్రాసిన ‘కౌముదీ మిత్రానందము’ అనే ప్రకరణము ముఖ్యమైనది. ఇది మృచ్ఛకటికకు తీసిపోయినా, ఆనాటి జైనగ్రంథములలో కనబడే దోషములులేక మనోహరమై ఉన్నది. దాని కథ యిది :

" మిత్రానందుడు ఒక రోజు అతడు తన మిత్రుడైన మైత్రేయునితో సముద్రప్రయాణము చేసి సాధుపుత్రుల వేషములతో వాసము చేస్తూ ఉన్న దొంగలగుంపు కావాసమైన ఒక ద్వీపమును చేరినాడు. దొంగల నాయకుడు మానవులను దోచుకొనడానికి వారిని తన కూతురైన కౌముదిని చూపించి పెండ్లి చేసుకొనుమనేవాడు. పెండ్లి కాగానే గర్భాగారగృహములో ఉన్నప్పుడు, దానిలో ఏర్పాటుచేసిన ఒక అగాధమైన గుంతలో వారిని త్రోయించివేస్తూ ఉండేవాడు. మిత్రానందుడు కౌముదిని ప్రేమిస్తాడు. మనసు పట్టలేక కాక కౌముది మిత్రానందుని ప్రేమించి తన తండ్రి కుట్ర నతనికి తెలుపుతుంది. ఇద్దరున్ను కలసి సింహళద్వీపమునకు పారిపోతారు. త్రోవలో ఒక దేశములో మిత్రానందుడు దొంగ అని పట్టుకొంటారు. కాని మిత్రానందుడు సర్పదష్టుడైన ఆ రాజు కొడుకును బ్రతికించి, రాజుదయకు పాత్రుడౌతాడు. రాజు కౌముదీ మిత్రానందులను మంత్రి కొప్పచెప్పుతాడు. ఆ మంత్రి కౌముదిమీద కన్నువేసి, మిత్రానందుని ఒక సామంత రాజువద్దకు పంపుతాడు. ఆ సామంతరాజుకు నరమేధముకోస మొక పురుషుడు కావలసి ఉండేది. ఆ సామంతరాజువద్ద ఉన్న మైత్రేయుడు మిత్రానందుని గుర్తించి అతనిని రక్షిస్తాడు. మంత్రి భార్య తన భర్త కౌముదిని ప్రేమిస్తున్నాడని తెలిసి, ఆమెను ఇంటినుండి తరిమివేస్తుంది. కౌముది దేశాటనము చేస్తూ, సుమిత్ర అనే ఒక సెట్టి కూతురుని చేరుకొంటుంది. కొంతకాలమునకు వజ్రవర్మ అనే రాజకుమారుడు సుమిత్ర కుటుంబముతో కూడా కౌముదిని చెరలో పెట్టుతాడు. అక్కడ కౌముదీ సుమిత్రలు మిత్రానందుని స్నేహితుడైన మకరందుని కలుస్తారు. సుమిత్ర మకరందుని పరిణయమాడుతుంది. వారు ముగ్గురున్ను తప్పించుకొని తిరుగుతూ ఉండగా, ఒక కాపాలికుడు వారి కెదురౌతాడు. వాడు మకరందుని చంపడానికి ఒక శవమునకు ప్రాణప్రతిష్ఠ చేస్తాడు. ప్రాణమువచ్చిన ఆపురుషుడు కాపాలికునే చంపివేస్తాడు. తర్వాత మకరందుడు కౌముదీ సుమిత్రలతో సింహళద్వీపము చేరుకొంటాడు. అక్కడ కౌముదీ మిత్రానందుల పునస్సమాగమమవుతుంది. చిరప్రయాణములచేత బడలిఉన్న

కౌముది పాదములను మిత్రానందుడు ఒత్తుతానంటాడు. వారిద్దరికిన్ని ఈ క్రింది సంభాషణ జరుగుతుంది.

మిత్రానందుడు (తనలో) :— ఈమెకు నా కుటుంబము సంగతి తెలియదు. నా గుణము కూడా తెలియదు. నేనీమె కెట్టి ఉపకార మున్ను చేయలేదు. కాని ఈ ఉత్పలాక్షి నాకోసము తన బంధువు లను విడిచిపెట్టినది. నిజముగా కాములకు వివేక ముండదు (కౌముదితో) - ప్రియురాలా, నీవు చాలా కష్టములు పడినావు. గృహమును విడిచి చలి అనక, ఎండ అనక, గాలి అనక, పాద చారిణివై తిరిగినావు. నిన్ను చిరకాలమునుంచిన్నీ ప్రేమించిన నీ బంధువులకు పరిహాసాస్పదమవైనావు. ఈ కష్టమంతా నాకోస మనుభవించినావు. నేను దూరదేశములోని ఒక సెట్టిని. నాకుటుంబ మును గురించి కాని, శీలమును గురించి కాని, ధనమును గురించి కాని నీకు తెలియదు. నాకు నీపై ప్రేమ ఉన్నదో లేదో కూడ నీకు తెలియదు. గ్రుడ్డిగా ఒక కొండ నెక్కుదలస్తున్నావు. ఒక చిన్న పడవ అయినా లేకుండా, మహాసముద్రమును తరింపజూస్తున్నావు. మంత్రౌషధములు తెలియనిదే ఒక మహాసర్పమును రేపెట్టినావు.

కౌముది :— ఆర్యపుత్రా, స్త్రీలందరు ఇట్లే చేస్తారు. ఈ నా నడవడికను చూచి నీ వాశ్చర్యపడనేల ? కామప్రేరితలై స్త్రీలు ఒక్కక్షణము మాత్రము తాము చూచిన ప్రియులకోసము చిన్న నాటినుంచిన్నీ పెరిగిన కుటుంబమును విడిచిపెట్టేస్తారు.

మిత్రానందుడు (తనలో) :— స్త్రీలు వీరులలో వీరులు. ప్రేమాంధులై తమ ప్రాణములను తృణప్రాయముగా చూస్తారు.

కౌముది :— వారు పరదేశములకు పోవచ్చును. దుఃఖముల నను భవించవచ్చును. అభాగినులై తిరుగవచ్చును. కాని వారు తమ ప్రియులనే ప్రేమిస్తారు.

ఆకాలములో ప్రాకృతనాటకము లనేకములు బయలు దేరినవి.

అపభ్రంశ వాఙ్మయ మీకాలములో ఎక్కువగా ప్రబలినది. వ్యావహారిక భాషలో ఎన్నో పాటలున్నూ, కథలున్నూ బయలుదేరినవి. కథలలో 'భవిసయత్తకథ' (భవిష్యత్కథ) చాలా ముఖ్యమైనది. ఇది పదోశతాబ్దములో ధనపాలునిచేత రచింపబడినది. తక్కిన ధర్మకథలలో వలెనే ఇది జైనధర్మోపదేశకముగా ఉన్నది. కాని ఉపదేశము ప్రత్యేకముగా గ్రంథాంతమందు చేర్చబడుటచేత మొదటిభాగములోని కథకు భంగము కలుగలేదు. దీనిలో కథ యిది :—

హస్తినాపురములో ఒక ధనికుడూ, సుందరుడూ నైన ఒక సెట్టి ఉండేవాడు. అతని భార్య కమలశ్రీ. కమలశ్రీకి భవిష్యుడు పుట్టి పెద్దవాడై సకలవిద్యాపారంగతుడైనాడు. అతని తండ్రి సురూప అనే మఱియొకతెను పెండ్లాడినాడు. అతనికి కమలశ్రీ మీద ప్రేమ తగ్గుతూ వచ్చినది. సురూపకు బంధుమిత్రుడనే కొడుకు పుట్టినాడు. వాడు ఆతతాయియైనాడు. వానికి పరదేశములకు పోవ బుద్ధి పుట్టినది. ఆదేశపు రాజు చెప్పినా వాడు తన పరదేశయాత్రా కుతూహలమును విడువలేదు. కాబట్టి వానిని పోనీయక తప్పినదికాదు. వానితో భవిష్యుడు కూడా బయల్దేరినాడు. తండ్రియైన సెట్టి బంధుదత్తుని కిరీతిగా కొంమటి ఉపదేశం చేస్తాడు. "నీకేదైనా కష్టము వస్తే ఈరీతిగా ప్రవర్తించు. ఎవ్వరికిన్నీ కష్టమైన మాట పలుకకు. బేరసారములు తెలియనివానివలె నటించు. స్నేహితునికైనా నీ మర్మము చెప్పకు. ఎక్కువ మాటలు మాట్లాడకు. మాట్లాడునది ఆలోచించి మాట్లాడు. ఏ ఉపాయముచేతనైనా సరే డబ్బు కూడబెట్టు. ధనార్జన విషయములో మోసము

చేసినా తప్పులేదు. నీ సరకులను పొగడుకో. ఇతరుల మనస్సులను మరియొకదారికి త్రిప్పి వారి అభిప్రాయములను తెలుసుకో. నీ రహస్యముల నితరులకు తెలియనీయవద్దు. ఇతరుల రహస్యములను తెలిసికోడానికి ప్రయత్నించు. ఇతరు లేమి చేసినా వారి పనులలో జోక్యము కలుగజేసికోకు. నీ పని నీవు చూసుకో. ఎంత నమ్మినవారికైనా నీ గుణశీలములను తెలియనీయకు. ఇతరుల నమ్మకమును సంపాదించి వారి స్వభావమును తెలిసికో." ఈరీతిగా ఉపదేశము పొంది బంధుదత్తుడు భవిష్యునితో ఓడలలో సముద్రప్రయాణము సాగించినాడు. త్రోవలో తుపానుబట్టి వారు మైనాకద్వీపము చేరుకొన్నారు. అక్కడ భవిష్యుడు ఫలపుష్పములకోసము పోగా బంధుదత్తుడు తన స్నేహితులతో ఓడయెక్కి తన దారిని తాను పోయినాడు. భవిష్యుడు తన అవస్థను తెలిసికొని అడవులనూ కొండలనూ దాటి పోగా పోగా ఒక గొప్ప నగరము కనబడినది. దానిలో గొప్ప హర్మ్యములూ, సకలవస్తుభరితములైన అంగడులూ ఉన్నవి. కాని అక్కడ మనుష్యు లెవరున్నూ లేరు. భవిష్యుడు భయపడకుండా ఒక దేవాలయము లోనికి పోయి దానిలో నిద్రపోయినాడు. అప్పుడు అచ్యుతనాథుని కతనిమీద కరుణగలిగి యక్షనాథుడైన మణిభద్రుని బిలిచి భవిష్యుని హస్తినాపురమునకు దిగబెట్టమన్నాడు. భవిష్యుడు నిద్రనుండి మేల్కొనగానే తనకు కాబోయే భార్య ఉన్న ఒక ఇంటికి దారి చెప్పుతూ ఒక అశరీరవాణి వినబడినది. ఆ మాటల ప్రకారము అతడు ఆ యింటికి పోగా అక్కడ ఒక చక్కని యువతి కనబడినది. ఆమె లజ్జావనత

ముఖియై, అతనితో మాట్లాడి, ఒక రాక్షసుడు తన్నచ్చట ఉంచినాడనిన్నీ, వాడు రాకపూర్వమే తనను తీసికొనిపోవలసినదనిన్నీ ప్రార్థించినది. భవిష్యుడామెకు తన కథను చెప్పి తన్ను పెండ్లాడమన్నాడు. ఆమె కూడా కామబాణహత హృదయయై ఒప్పుకొన్నది. వారిట్లు మాట్లాడుచూ ఉండగానే చీకటివలె నల్లగా ఉన్న రాక్షసుడు వచ్చినాడు. భవిష్యుడు భయపడకుండా వాని నెదురుకొన్నాడు. రాక్షసుడకస్మాత్తుగా తన పూర్వజన్మవృత్తాంతమును స్మరించి, భవిష్యునికి లొంగిపోయి, అతనికి మిత్రుడై, నాపురమును జనసంకులముగా జేసి, ఆ పట్టణమునూ, ఆ కన్యకనూ భవిష్యునికి సమర్పించినాడు. వారిద్దరున్నూ అచ్చట అనేక సంవత్సరములు సుఖముగా గడపినారు. తుదకు విసుగుబుట్టి తన దేశమునకు బోవలెనని, సమస్తమైన అమూల్య రత్నరాసులతో సముద్రతీరమునకు వచ్చినారు. అదేసమయమున బంధుదత్తుని ఓడ ఆ ద్వీపము దగ్గరగా పగిలిపోయినది. బంధుదత్తుడు భవిష్యుని కలుసుకొని తియ్యని మాటలాడి తమ దేశమునకు పోవుదమని చెప్పి, భవిష్యుడు దగ్గరగా లేనిసమయము చూచి, అతని ధనమునూ, భార్యనూ పడవలలోని కెక్కించి లేచిపోయి, హస్తినాపురము చేరుకున్నాడు. చేసుకొని ఆ యువతి తన భార్య అనిన్నీ, ఆ ధనమంతా తాను సంపాదించినదే అనిన్నీ రాజుతో చెప్పి అతని మన్ననలను పొందినాడు. భవిష్యుని తల్లి మాత్రము కొడుకు రాలేదని దుఃఖించినది. ఇంతలోగా యక్షరాజు భవిష్యుని తన విమానములో హస్తినాపురమునకు దీసికొని వచ్చినాడు. భవిష్యుడు తల్లిని కలసికొని, రాజుతో జరిగిన

వృత్తాంతమంతా చెప్పగా, అతడు బంధుదత్తుని శిక్షించి, తన కూతురైన సుమిత్రను భవిష్యునికిచ్చి పెండ్లిచేసినాడు. ఆ తరువాత పోయెనాపురరాజు హస్తినాపురముమీదికి దండెత్తి వచ్చినాడు. భవిష్యు డతనిని ఓడించినాడు. రాజతనిని యువరాజుగా చేసినాడు.

జైనసాధువులు రచించిన ఇట్టి కథ లింకా అనేకము లున్నవి. కాని ఇవి అన్నీ ప్రాకృతభాషలో వ్రాయబడినవి. ఈ ప్రాకృతభాష కింకను గుజరాతీ అనే పేరు రాలేదు. పదమూడో శతాబ్దము అంతమువరకున్నూ ఇట్టి వాఙ్మయమే గుజరాతుదేశములో ఉండేది. 1261 లో విశాలదేవుడు చనిపోయినతర్వాత దేశములో అరాచకము ప్రబలినది. 1300 నుండి 1400 వరకు ఒకశతాబ్దము దేశ మరాజకమై, తుదకు ముసల్మానుల పరిపాలనకు లోనైనది. పండితులున్నూ కవులున్నూ దేశమును విడిచి, ఇతర రాజుల నాశ్రయించుటకు పోయినారు. కాని జనుల వ్యవహారభాషలో పాటలు, పదముల రూపమున ఆ కాలమునాటి వాఙ్మయము కొంత మిగిలినది. ఈ వాఙ్మయము నిజమైన గుజరాతీభాషకు మొదటి అవస్థలో నున్న భాషలో ఉన్నదని చెప్పవచ్చును. అంతకు పూర్వపుభాషకున్నూ ఈ వ్యావహారికభాషకున్నూ చాలా భేదమున్నది. ఈ క్రొత్తభాషలో బయలుదేరిన వాఙ్మయమును గురించి తర్వాతి అధ్యాయములో తెలుపబడును.

# ద్వితీయాధ్యాయము

## రాస, వీర, పౌరాణిక వాఙ్మయములు

---

"ఏలవచ్చెనమ్మ కృష్ణు డేలవచ్చెనే,
మాయదారి కృష్ణుడొచ్చి మహిమచేసెనే"

అని పాటలు పాడుకొంటూ తెనుగుపడుచులు అడుగులతో నృత్యముచేస్తూ గొబ్బితట్టడము తెనుగుదేశములో మనము సాధారణముగా చూస్తూఉంటాము. తెనుగులో గొబ్బిపాట లనేపేర ఇప్పటికిన్నీ ఎన్నోపాట లున్నవి. కాని ఇంగ్లీషు బడులొచ్చినతరువాత ఇంగ్లీషునృత్యమును నేర్చుకొన్న ఆడపిల్లలు గొబ్బిపాటలను మరచిపోతున్నారు. గొబ్బితట్టడము కృష్ణభక్తికి సంబంధించినది. కృష్ణుని బాల్యచేష్టలనూ, అతని రసిక విలాసములనూ, రాధాకృష్ణుల ప్రేమనూ, గోపికలతో అతడు చేసే రాసలీలలనూ యీ గొబ్బిపాటలు వర్ణిస్తవి. ఇప్పటికిన్నీ పల్లెలలో మతవిషయికముగా గాకున్నా విలాసముగా ఆడుపడుచులు గొబ్బితట్టుతూ ఆనందిస్తారు.

ఈ గొబ్బితట్టడము భారతవర్షమందంతటకూ ఉన్నది. కన్నడమూ, తుళు–గొబ్బు, అరవము కొప్పి లేక కుమ్మి, మహారాష్ట్రము–గర్భ. బంగాళీ, ఒఱియా–గర్బో. గుజరాతీ–గరబీ. మొదలైన పేళ్ళతో ఇది ప్రచారములో నున్నది. దక్షిణదేశములో నేడిది చిన్నపిల్లల నృత్యముగా ఉన్నా ఒకానొకప్పుడు పెద్దవాండ్లుకూడా మతమునకు సంబంధించిన పండుగలలో

గొబ్బితట్టడము ఆచారముగా ఉండేది. కృష్ణుని రాసలీలకు ఇది అనుకరణము. మధుర బృందావనము ఉన్న గుజరాతు దేశములో ఈ రాసలీలకు ప్రాధాన్య ముండుట వింతకాదు. ఈ రాసలీల ననుసరించే యాత్రలు అనే వీధినాటకములు ఉత్తర హిందూస్థాన మందంతటా ప్రచారములో నున్నవి. ఉత్తరహిందూస్థానములో పురుషులు కూడా రాసలీల చేస్తూ ఉండేవారు. కృష్ణభక్తి గుజరాతులో ప్రబలి స్త్రీలునూ, పురుషులునూ కలసి రాసలీల చేయడము ఆచారమైనది. గుజరాతులో ఆశ్వయుజమాసము ఆరంభమున దేవీనవరాత్రములలో ఈ గరబో నృత్యములో స్త్రీలు మైమరచిపోతూ ఉంటారు. అప్పుడు వివిధప్రాంతములనుండి స్త్రీ లొకచోట చేరి ఒక కుండమీంద ఒక జ్యోతినుంచి దాని చుట్టునూ అడుగులు వేసి నృత్యము చేస్తూ కృష్ణునికి సంబంధించిన శృంగార గీతములను దేశీయగానములతో ఆలపిస్తారు. చేతులతోనూ, అడుగులతోనూ, తాళము వేస్తారు. ఈ తాళము వేసేటప్పుడు చేతులనైనా, కట్టెలనైనా ఉపయోగిస్తారు. చేతులు తట్టుతూ చేసే నృత్యమునకు తాళరాసమనిన్నీ, కట్టె లుపయోగించే దానికి లకుటరాసమనిన్నీ పేరు.

రాసనృత్యమునకు సరిపోయే గేయవాఙ్మయము గుజరాతీభాషలో అమితముగా ఉంది. ఈ పాటలకు ఛందస్సువసరము లేదు లయకూ నృత్యమునకూ ఆపాట సరిపోతే చాలును. సరిపోకపోతే సరిపెట్టుకుంటారు. ఈ పాటలకు కూడా రాస, లేక రాసక, లేక గరబీ అనే పేరు వచ్చినది. గుజరాతీలో వసంతోత్సవమునకు 'సాగ' అని పేరు. వసంతోత్సవములో

పాడే రాసగీతములకు 'ఫాగ' అని పేరు వచ్చినది. స్థూలిభద్ర ఫాగ అనే ఒక గీతము 1324 నాటిది ఒకటి మిగిలియున్నది.

రాస శబ్దమునకు కావ్యపరముగా నానాటికీన్నీ అర్థము మారుతూ వచ్చినది. కొంతకాలమునకు అనుప్రాసముతో కూడి దుహా, చుపాఈ ఛందస్సులలో వ్రాయబడిన దీర్ఘ కావ్యమునకు ఈ పేరు కుదురుకొన్నది. ఇట్టి రాసకావ్యమును శాలిభద్రుడనేవాడు భరతేశ్వర బాహుబలిరాస అనే కావ్యముగా 1145 లో వ్రాసినాడు. మొదటి చరితములకూ, ధర్మ కథలకు కూడా ఈ పేరుండి ఉండవచ్చును. తర్వాత కావ్యములోని విషయ మేమైనా సరే దానికి రాస మనే పేరు వచ్చినది. దేశీగానముతో కూడిన శృంగారకావ్యము కూడా రాస మనిపించుకొంటుంది. 'నేమినాథ చతుష్పదిక' అనే ఇట్టి కావ్యమొకటి 1269 నాటి దున్నది. దీనిలో రాజల అనే నాయిక నేమినాథునుండి కలిగిన విరహమునకు పరితపిస్తుంది. దీనినుండి చిన్న ఉదాహరణము,

భాద్రవి భరియా సర పిచ్చేవి సకరుణ రోఅఇ రాజలదేవి
హా ఏకలడి మఇ నిరధార కి మ ఊఏఖేపిసి కరునాసార ;
భణఇ సఖీ రాజల మన రోఇ నీఠుర నేమి న అప్పణు హోఇ;
సించియ తరువర పరి పలవంతి గిరివర తుణ కడబేరా హుంతి;
సాచఉ సఖి వరి గిరి భిజ్జంతి తిమఇ న భిజ్జఇ సామల కాంతి
ఘణ బలిసంతఇ సర పుట్టంతి సాయరు పుణ ఘణుఓహాడులింతి.

భాద్రపదమాసములో సరస్సులూ నీటితో నిండి ఉండడము చూచి, "ఓ కరుణాసార, నన్నొక్కకాకిగా, నిరాధారగా,

పల విడిచిపెట్టినావు" అని ఏడుస్తున్నది. ఆమె సఖి, "ఏడువకుం. అతడు నిష్ఠురహృదయుడు. అతడు మరి నీవాడు కాడు. లేదా అతడు ఒక చెట్టును పెంచి దానిని కాల్చివేయడు. నిన్ను కొండ కొన కెక్కించి అక్కడనుండి క్రిందికి త్రోసివేయడు." అని పలుకుతున్నది. రాజల, "నీవు సత్యము పలుకుతున్నావు. ఈ వానలలో సరస్సుల గట్లు తెగిపోతున్నవి. సముద్ర మల్లకల్లోల మవుతున్నది. కొండ లరిగిపోతున్నవి. కాని నా ప్రియ శ్యామలహృదయునికి కనికరము పుట్టదు" అని అంటున్నది.

ఈరీతిగా ఒకొక్క మాసమును గురించి పాడుతూ పండ్రెండు మాసములకునూ సంబంధించిన శృంగారగీతములను పాడుతుంది. ఇట్టి శృంగారకావ్యములకు 'బారమాసీ' అని పేరు.

పదహేనో శతాబ్దారంభమువరకున్నూ ప్రాచీన గుజరాతీభాషలో ఇట్టి చిన్న ఖండకావ్యములు మాత్ర ముండేవి. పెద్దకావ్యములను వ్రాసినవారిలో సోమసుందరుడు (1374—1446) మొదటివాడు. ఇతని 'రంగసాగరనేమిఫాగ' చక్కని కావ్యము. వసంతవిలాస మనే మరొక కావ్యములో వసంతకాలమందలి ఆనందము వర్ణింపబడినది. విరహిణియైన నాయిక వసన్తకాలము నవశృంగారమును చూచి ఇట్లంటున్నది.

రహీరహీ తోరీజో, అలి కొఇలీ స్యూ బహు వాంసి,
నాహు అజ్ నవి ఆవఇ, భావఇ మూన విలాస ;
హార తే భార మూ ఉర వరి, సఇరి శంగార అంగార
చీంత హారఇ నవి చందన, చంద నహీ మనోహార;

సఖి దీహా దూఖి అశీరఊఁ, దీశఊఁ గమఇ న చీర,
భోజన ఆజ ఊఛీరఊఁ మీఠఊఁ సదఇ న నిర;
సకల కలా తూ నిశాకర, తా కర సఇం సంతాప;
అబలా సు మారి కలంకీ, శంకీ హువఇ పాపు;
భమరలా భాండీ న పాఖల, ధ్యా అహ్మే సఇర,
చాందులా సఇర సంతాపణ. ఆపణ తా నహీ వఇర.

"చెలీ కోయిలా, నిలు, నిలు. ఎందుకు అంతగా పాడుతావు. నేనొంటరిగా ఉన్నాను. నానాథుడు దూరదేశములో ఉన్నాడు. నాకిప్పుడు సుఖములేదు. నా హారము ఉరముపై భారముగా నున్నది. చెలీ, ఈ ఆభరణములు నాకు మండుతూ ఉన్న అంగారముల వలె ఉన్నవి. పరిమళము నన్నాకర్షించదు. చంద్రుడు నాకు మనోహరుడుగా లేడు. సఖీ, నా శరీరము బాధచే వడకుతున్నది. నాకీ వలిపములు అందముగా లేవు. ఆహారము నాకు రుచించదు. తీయని నీరు కూడా నాకు చప్పగా కనిపిస్తున్నది.

పూర్ణచంద్రుడా, నన్నెందుకు బాధపెట్టుతావు. ఓకలంకీ! అబలనైన నన్నేల చంపుతావు. బాగుగా ఆలోచించుకో. నన్ను చంపితే నీకు పాపము వస్తుంది.

ఓ తుమ్మెదా, నాయంతట నన్నుండనీయవేమి. నాశరీరము బలహీనమైనది. ఓయీ చంద్రుడా, సంతాపకుడా, నీకునూ నాకునూ పూర్వవైర మేమున్నది."

నతర్షి (1439) అనే కవి ఒక ఫాగు కావ్యమును రచించినాడు. ఫాగు వాఙ్మయమున కిది చక్కని ఉదాహరణము.

## ఫాగు

ఆవియ మాస వసన్తక, సంత కరఇ ఉత్సాహా,
మలయానిల మహి వాయఉ, ఆయఉ కామ గిదాహా

## రాసకము

వణవరి ఆవియ ప్రభు వీణవిఉ, నవి దసఇ దిసారీ రే,
మాధవ భేరణీ ఆవఇ, ఆవిత దేవ మురారి రే;
వాత సుణీ ప్రభు మణి అతి హరఖియు, నిరఖియ గృహ
పరివార రే,
నిజ పరివారి ఇ జాదవ పుహతు, వహతు వనహ మఝారి రే;
ఫణ భరి నమత్రీ తరుణీ కరుణీ, వరుణీ చరణ సంచారి రే,
చాలఇ చమకత ఝమకత నేఉర, కేఉర కీటక విశాల రే,
వేణియ వయణి మిఘుతరి, భింతరి రవాఉ సిరి నాగ;
అధరరంగ పర వాలియ, ఆలియ నావఇ భాగ;

## ఆందోల

నాచఇ గోపియ వృంద, వాఇ మధుర మృదంగ,
మోడఇ అంగ సురంగ, సారంగధర వాఇత మహూామురి వె,
కులవణ మహూాయర ఏ;
కర లిఇ పంకజ నాల, సిరి వరి ఫేరఇ బాల,
ఛందిహి వాజఇ తాల, సారంగధర ॥
తారా మహి జిమ చంద, గోపియ మాహ ముకుంద,
పణమఇ సురసర ఇంద, సారంగధర ॥

ఫాగు

గోపియు గోపతి క్రీడత, హిండత వనహా మఝారి,
మారుత ప్రేరిత వన భర నమఇ మురారి.

ఫాగ మాస మారంభమైనది. వసంతము వచ్చినది. సత్పురుషులు సంతోషిస్తున్నారు. మలయమారుతుడు వీస్తున్నాడు. కాముడు బాణములను పట్టుతున్నాడు.

వనలక్ష్మి వచ్చి, "పది దిక్కులునూ నూతనస్వరూపములను దాల్చినవి. కృష్ణా, మురారీ, ప్రభూ, కామదేవుడు నిన్ను కౌగలించుకొన వస్తున్నాడు. దయచేసి రా" అని నాథుని పిలుస్తున్నది.

దానిని విని నాథుడు సంతోషించి తన పరివారమువంక చూచినాడు. మిత్రులతో యాదవు డడవికి పోయినాడు.

స్తనభారాలసలై గజగమనముతో మోహావిభ్రాంతలై కన్యక లతని ననుసరిస్తున్నారు. వారి అందెలు మ్రోగుతున్నవి. విశాల శిరోలంకారములు ప్రకాశిస్తున్నవి. వారి జడలు సర్పములవలె మిలమిల లాడుతున్నవి. వారి పెదవులతో సాటి రాబూని పగడము లోడిలిమని చెప్పుతున్నవి.

గోపికలు నృత్యముచేయ నారంభిస్తున్నారు. మధుర మృదంగములను వాయిస్తున్నారు. తమ అందమైన శరీరములను వంచి వారు తాళము ననుసరించి నృత్యము చేస్తున్నారు. గోపకుల నాథుడైన శార్ఙ్గధరుడు వేణువు నూదుతున్నాడు.

గోపికలు తమ చేతులలో మృణాలనాళములను పట్టు కొన్నారు. రాగ తాళముల ననుసరించి వాటిని తమ తలలపై నాడించుచున్నారు. శార్ఙ్గధరుడు వేణువు నూదుతున్నాడు.

తారకలలో చంద్రునివలె గోపికల మధ్య ముకుందుడు ప్రకాశిస్తున్నాడు. సురతానరులూ, ఇంద్రుడునూ అతనికి ప్రణమిల్లుతున్నారు. శార్ఙ్గధరుడు వేణువు నూదుతున్నాడు. గోప శ్రేష్ఠుడైన ముకుందుడునూ, గోపికలునూ, నృత్యము చేస్తూ అడవిలో సంచరిస్తున్నారు. మలయమారుతప్రేరితమై వనము మురారిని నమ్రమై నమస్కరిస్తున్నది.

## గద్యకథా వాఙ్మయము

రాసవాఙ్మయము కృష్ణభక్తులలో ప్రబలుతూ ఉండగా జైనసాధువులు తమ మతధర్మములను గద్యకథలమూలముగా వ్యాపింపజేస్తూ వచ్చినారు. ఈ గద్యకావ్యములు కాదంబరి ననుసరించి శ్లేషకావ్యములుగా తీర్చబడినవి. తరుణప్రభుడు (1355) వ్రాసిన 'పరిక్రమణ బాలావలోధ' అనే గ్రంథములో జైనధర్మములను చక్కగా వివరించినాడు. సోమసుందరుడు తన ఉపదేశమాల, యోగశాస్త్రము అనే గ్రంథములలో అనేకములైన జైనకథలను వ్రాసినాడు. వీటిలో జైనులకు బ్రాహ్మణులమీద గల ద్వేషము ప్రకట మవుతూ ఉంటుంది. అట్టి కథ ఒకటి.

"ఉజ్జయినిలో అఘోరశివు డనే ఒక టక్కరిబ్రాహ్మణు డుండేవాడు. వాడు చర్మకారుల దేశానికి పోయినాడు. అక్కడ

వానికి దొంగ లెదురుపడ్డారు. వారితో వాడన్నాడుగదా: 'నేను సన్యాసినని అందరున్ను నమ్మడానికి మునివేషము వేస్తాను. నన్ను మీరు పొగడుతూ ఉండండి. జనులు మోస పోతారు ' అని. దొంగ లొప్పుకొన్నారు. ఆ బ్రాహ్మణుడు సన్యాసివేషము వేసుకొని మూడు గ్రామముల కూడలిలో ఉండే ఒక అడవిలో ఉన్నాడు. వాడు నెలరోజులనుంచిన్ని నిరాహారి అయి ఉన్నాడనిన్ని; గొప్ప మహాత్ముడనిన్ని దొంగలు పొగడ నారంభించినారు. జనులు వాని నతిథిగా పిలిచినారు. వాడు నిజమైన సన్యాసి అనుకొని తమ కెంత ధనముండేదీ తెలిపి, తమకు ముందు కలుగబోయే లాభము లను గురించి అడుగ నారంభించినారు. వారి ధనమును గురించి తెలుసుకొని ఆ బ్రాహ్మణుడు దొంగలతో కలిసి రాత్రి అచ్చటి జనుల ధనమును దోచికొని పోయినాడు. ఒకనాడు ఆ దొంగ లలో ఒకడు పట్టుబడినాడు. వానిని బాధించగా బ్రాహ్మణు నితో దొంగలందరున్ను దొరికిపోయినారు. జనులా బ్రాహ్మ ణుని కంటిగ్రుడ్లు ఊడబీకి వదలినారు. కంటిబాధను, అవమాన బాధను భరించలేక వాడు చచ్చి నరకమునకు పోయినాడు. ఇతరులను మోసగించేవాడు తన పనులకు పశ్చాత్తాపము పొందక తప్పదు."

పై కథ అంత బాగులేకపోయినా ఆనాటి గుజరాతీ వాఙ్మయములోని గద్యకథల కుదాహరణముగా ఇవ్వబడినది. కొన్ని గద్యకథ లింతకంటె రచనలో బాగుంటవి; అనుప్రాస పూరితములై చదువడానికి అందముగా ఉంటవి. ఈ క్రింది

ఉదాహరణము మాణిక్యచంద్రుని (1422) పృథ్వీచంద్రచరిత్ర మనే గద్యధర్మకథనుంచి తీసుకొనబడినది.

మహారాష్ట్రదేశమునకు రాజధాని అయిన పైఠానపురమును పృథ్వీచంద్రు డనే రాజు పాలిస్తూ ఉండేవాడు. అతని కొకనా డొక అందగత్తె అయిన రాచకొమార్తె ఘల్లుఘల్లున అందెలచప్పుడు చేసుకొంటూ వచ్చి ఒక పూలమాల నాతని మెడలో వేసినట్లు కల వచ్చినది. రాజు మేలుకొని మంత్రుల నందరిని పిలిచి తన కలను చెప్పుతూ ఉండగా, అతని సభకు కోసలదేశ రాజధానిఅయిన అయోధ్యనుంచి ఒక దూత వచ్చి తనరాజయిన సోమదేవునికి డబ్బయినాలుగు కళలను అభ్యసించిన రత్నమంజరి అనే రాజకన్యకను గురించి చెప్పిపోతాడు. తరువాత వర్షాకాలము వచ్చినది.

" విస్తరిఉ వర్షాకాల, జే పంథీతణఉ కాల, నాఠఉ దుకాల; జేణిఇ వర్షాకాలి మధురధ్వని మేహ గాజఇ దుర్భిక్షతుణ భయ భాజఇ, జాణే సుభిక్షభూపతి ఆవతా జయఢక్కా-వాజఇ; చిహు దిసి బీజ ఝలహాలఇ, పంథీ ఘరమణీ పులఇ; విపరీత ఆకాశ, చంద్రసూర్య పరియాస; రాతి అంధారీ, లవఇ తిమిరీ; ఉత్తరనఉ ఊనయణ, ఛాయఉ గయణ; దిసి ఘోర, నాచఇ మోర; సధర, వరసఇ ధారాధర; పాణీతణా ప్రవాహ షలహాలఇ, వాడీ ఊపరి వేలా వలఇ; చీషలి చాలతా శకట స్ఖలఇ, లోకతణా మన ధర్మఊపరి వలఇ; నదీ మహాపూరి ఆవయి, పృథ్వీపీఠ ప్లావఇ; నవా కిసలయ గహాగహాఇ, వల్లీ వితాన లహాలహాఇ; కుటుంబీ లోక మాచఇ, మహాత్మా

జళితా పుస్తక ఖాచకి; పర్వతతడు నిఝరణ నిఘాతకి, భరియా సరోవర ఫూటకి; ఇసిత వర్షాకాలి రాజా సోమదేవ తణఉ కరావిడు సరోవర ఖారకు సముద్రసమాణడు.

విస్తరించెను వర్షాకాలము. పాంథజనులకు వైరకాలము. పోయెను దుష్కాలము. జీర్ణించెను గ్రీష్మకాలము. మధుర ధ్వనిగ మేఘములు గర్జించెను. దుర్భిక్షము ననుభవించుచున్న వారి భయమును భర్జించెను. సుభిక్ష భూపతి రాకను జయ ఢక్కలతో ఉపసర్జించెను. నలుదిక్కులను మెరపు చంచ లించెను. పాంథుల పాదములు గృహములవంక కనుసరించెను. విపరీత మాకాశము. చంద్ర సూర్య పర్యాసము. రాత్రి అంధకారము. చిమ్మెటల ఘీంకారము. ఉత్తరమునుండి వాయు వేగము. మేఘాచ్ఛాదితము గగనము. దిశలు ఘోరము. నటించెను మయూరము. సధారము వర్షించెను ధారాధరము. జలజల ప్రవహించెను నీళులు. గట్టులను వ్యాపించెను వల్లులు. బురదను శకటములు తగుల్కొనెను. లోకుల మనములు ధర్మముపై కీలుకొనెను. నదులు మహాపూరము లుచ్ఛలిం చెను, పృథ్వీపీఠము నావరించెను. నవకిసలయము లుదయిం చెను. వల్లీవితానము నటించెను. కర్షకలోకము మోదించెను. మహాత్మబృందము కూర్చుండి పుస్తకములను పఠించెను. పర్వ తములనుండి నిర్ఝరిణులు పరుగులెత్తెను. సరోవరములు నిండి తటముల నొత్తెను. ఇట్టి వర్షాకాలమున సోమదేవరాజు సరో వరమును సముద్రమును బోలినదానిని చేరబోయెను.

కథ ఈరీతిగనే వర్ణనములతో నిండి ఉండును. రాజున కెన్నియో అపాయములు కలిగినా తుదకు స్వయంవరములో రత్నమంజరి పృథ్వీచంద్రుని వరిస్తుంది.

ఇట్టి గ్రంథము లింకనూ చాలా ఉన్నవి. ప్రభాచంద్ర ప్రద్యుమ్నుడు (1278) రచించిన ప్రభావక చరిత్ర, మేరు తుంగుడు (1303–1306) రచించిన ప్రబంధచింతామణి, రాజశేఖరుడు (1348) రచించిన చతుర్వింశతి ప్రబంధము వీటిలో ముఖ్యమైనవి. వీటిలో అనేకరకములైన కథలున్నా అవి అన్నీ జైనమతమునకు సంబంధించినవి. అవి చరిత్రాత్మకములు కావు. అద్భుతములూ అసంభవములైన విషయము లనేకములు వీటిలో కనబడును.

## వీర వాఙ్మయము

అపభ్రంశ ప్రాకృతములో చాళుక్యులూ, వాఘేలులూ అను రాజులలో వీరులైన రాజుల వృత్తాంతములను కీర్తిస్తూ కొంత వాఙ్మయము బయలుదేరినది. ప్రాచీన గుజరాతీ భాషలో కూడా అట్టి వాఙ్మయ ముండి ఉండవలెను. కాని అట్టి కావ్యములలో రెండు మాత్రము నేడు లభ్యము లౌతున్నవి 'రణమల్లఛంద' అనే పదమును శ్రీధరకవి (1400) పదముగా రచించినాడు. దీనిలో ఇడర సంస్థానాధీశుడైన రణమల్లుని ధైర్యసాహసములు వర్ణింపబడినవి. దీనిలో 70 ద్విపదలు మాత్ర మున్నవి. భాష ప్రాచీనమునూ, అనుప్రాసమయమునుగానూ ఉంటుంది. పాడుతూన్నప్పుడు లయకు సరిపోవడానికి శబ్దముల స్వరూపము చాలా మారిపోతుంది.

రణమల్లుడు రాఠోడ్ వంశస్థుడు. గొప్ప యోధుడు. 1397లో అతడు పాటణపుర పాలకుడైన జఫరుఖానుపైన దాడి వెడలి ముసల్మానులకు భయము పుట్టించినాడు. "సిరిపురమాణ ధరవి సురత్తానీ ధరదము అంతమాల ద్రివాణి" సుల్తాను సేన శౌర్యముతో పైకి వస్తూ ఉంటే రణమల్లుని మీసములు కోపముతో పైకి లేచినవి. సుల్తాను రణమల్లుని తనకు లోబడుమంటాడు. రణమల్లుడు గర్జిస్తున్నాడు.

ముఝు సిరకమల నేచ్ఛపయా లగ్గఇ తుగయదింగమణి భాణవ
ఉగ్గఇ,
జా అంబర పుడతలి తరణి రమఇ, తాకమ్మ ద్రజ కంధన ధగ
ధనమఇ,
వరి వకహానలా తణా ఝూల శమఇ, పుణమ్లేచ్ఛ నఇపు చాస
కిమఇ.

కమలము వంటి నాశిరస్సు మ్లేచ్ఛుని పాదములకు మొక్కితే సూర్యుడాకాశముమీద ఉదయించడు. సూర్యుడు ఆకాశముమీద సంచరిస్తున్నంతకాలమున్నా కమధజుడు రాతిబండకు ప్రణమిల్లడు. బాడబాగ్ని చల్లారినా, మ్లేచ్ఛుని కొక అంగుళమైననూ భూమిని దక్కనీయను.

సుల్తానునకున్నూ రణమల్లునికిన్నీ యుద్ధముజరుగుతుంది. ముసల్మానులోడిపోతారు. రణమల్లుడు వారిచే గడ్డి కరపించి అవమానిస్తాడు.

ఖాన్ హడక్ష (ప్రబంధ (1456) ఇంతకంటె చక్కని కావ్యము. 1297 తర్వాత గుజరాత దేశస్థులు 14 వ శతాబ్ద

ములో నిర్భీకగా శౌర్యసాహసములతో పోరాడినదిన్ని ఈ గ్రంథము తెలుపుచున్నది. దీనిని రచించినవాడు ఝాలోరా రాజైన చోహాణ వంశస్థుడైన అఖైరాజు ఆస్థానకవి, వీసల నగరవాస్తవ్యుడు పద్మనాభుడు. మూరవాడదేశము, తొమ్మిది కోటల సామ్రాజ్యము. సోనగిరా చౌహాణులు. రాజహంసలు నెలిసదేశము. కరణదేవఘేలో గుజరాత చక్రవర్తి. కేశవుని భార్యను మోహించి భర్తను జంపి ఆమెను చెరబట్టినాడు. కేశవుని తమ్ముడు మాధవుడు మంత్రి. క్రోధావిష్టుడై "తురకలను ఇచ్చటికి తీసుకొని వచ్చేవరకూ గుజరాతుదేశములో నేను భోజనముచేయను! అని శపథముపట్టినాడు. కవి వ్యక్తిగతమైన యీఅపకారమునకు గాను మాధవుడు దేశద్రోహి ఔతాడే అని దుఃఖిస్తున్నాడు.

జిహాఁ పూజీఇ సాలగ్రామ, జిహాఁజలీఇ హరిసూనామ, జిణి దేశికజఇ యాగ, జిహాఁ విప్రవసఇ బీజఇత్యాగ, జిహాఁ తులసీ పీపల పూజఇ వేద పురాణధర్మ బూఝిఇ, జిణి దేశిసహూ తీరథజాఇ, స్మృతిపురాణ మాలీఇ గాఇ ... ....— మాధవి మ్లేచ్ఛ ఆణే ఆతళ్యా.

ఎచటి సాలగ్రామమునుపూజించి, హరిస్తోత్రముచేసి నాడో, ఎచట యాగములనుచేసి బ్రాహ్మణులకు దానములను చేసినాడో, ఎచట తులసిని, అశ్వత్థవృక్షమును పూజించినాడో, వేదపురాణములనువిన్నాడో ఎచటికి నానాదేశములనుండి జనులు తీర్థయాత్రలకైవస్తారో ఎచటిస్మృతులును పురాణ

ములుగా కీర్తింపబడుతున్నవో అచటికి మాధవుడు మ్లేచ్ఛులను దీసికొని వచ్చినాడు.

మాధవుడు ఢిల్లీకిపోయి, అల్లాఉద్దీనును దర్శించి తనకొక సైన్యమునిస్తే. గుజరాతును సుల్తానధీనము చేస్తానని చెప్తాడు. సుల్తానంగీకరించి గుజరాతుకు రాజసైన్యము పోతున్నదనిన్నీ, దానిని తనదేశముగుండా పోవలసినదనిన్నీ ఝాలోరా చౌహాణ రాజైన ఖాన్ హడదేకు వర్తమాన మంపుతాడు.

ఖాన్ హడదే దాని కొప్పడు. అల్లాఉద్దీను గుజరాతును జయించవలెనని నిశ్చయించి మేవాడదేశము ద్వారా సైన్యమును పంపుతాడు. ముసల్మాను సైన్యములు మాధవుని నాయకత్వమున పాటణపురమును ముట్టడిస్తవి. మాధవుడు ప్రాణముమీద ఆశ ఉంటే పారిపోవలసినదని రాజుకు కబురు పంపుతాడు. రాణితో రాజు పారిపోతాడు. పాటణపురము ఉల్లాఉద్దీను సేనానాయకుడైన అలఫ్ఖానునకు వశమౌతుంది. ముసల్మాను సేనలు దక్షిణమునకు దండయాత్ర సాగించి అనేక పట్టణములను పాడుచేస్తారు. రాజపుత్రులు సోమనాథ దేవాలయ రక్షణార్థము పోరాడుతారు. కార్యము లేకపోతుంది. యుద్ధము చేస్తూ ఆ వీరు లందరూ నశిస్తారు. ఆ యుద్ధములో మాధవుడు కూడా హతుడౌతాడు. అలఫ్ఖాను సోమనాథ లింగమును పగులకొట్టి ఆ ముక్కలను బండిలోవేసి ఢిల్లీకి తీసుకుపోతాడు. 'ఈ రాతిని కాల్చి సున్నము చేస్తాను' అంటాడు. ఈ సందర్భములో కవి శివుని కిరితిగా మొర పెట్టుకుంటాడు.

ఆగ్న రుద్ర! తారా క్రోధానలి దైత్యసవే తేఇ బాల్యా,
తేఇ ప్రథ్వీ మాహిం పుణ్య వరతావిఊ దేవలోకి
భయ టాల్యా.
తే బలవాన త్రిపుర విధ్వంసిఊ పవన వేగి జిమ తూల;
పద్మనాభ పూఛఇ సోమరాయా! ఖేదఊ కరూం త్రిశూల.

రుద్రుడా! నీక్రోధానలముతో దైత్యులను కాల్చివేసినావు. పృథ్విలో పుణ్యమును వ్యాపింపజేసినావు. దేవతల భయమును పాపినావు. గాలి ఊకను ఎగురగొట్టినట్టు బలవంతుడైన త్రిపురాసురుని పారదోలినావు. పద్మనాభుడు అడుగుతున్నాడు. ఓ రుద్రుడా, నీ త్రిశూల మెక్కడ నున్నది.

అలఫ్‌ఖానుని సైన్యములు దేశమునంతా పాడుచేస్తూ జనుల ధనమును దోచుకొంటూ బ్రాహ్మణులనూ, పిల్లలనూ, స్త్రీలనూ చెరలో పెట్టి తోలుకొరడాలతో కొట్టిస్తూ, ఖైదీలను తురకలుగా మార్చివేసినాడు. తరువాత తనసైన్యమునకు దారి ఇవ్వమని ఖాన్‌హాడదేవిూదికి తిరిగినాడు.

గంగా పార్వతులు ఖాన్‌హాడదే స్వప్నములో కనబడి మ్లేచ్ఛునినుండి ఈశ్వరుని రక్షించవలెననికోరుతారు. యుద్ధము జరుగుతుంది. తురకలోడిపోతారు. అలఫ్‌ఖానుడు పరుగెత్తి ప్రాణాలు రక్షించుకొంటాడు. సోమనాథలింగము ముక్కలను ప్రత్యేకముగా ఐదుపురములలో ప్రతిష్ఠిస్తారు. రాజు తొమ్మిదిలక్షలమంది ఖైదీలను విడిపిస్తాడు. అలఫ్‌ఖానుడు రాత్రిపూట దొంగతనముగా ఢిల్లీలో ప్రవేశిస్తాడు. తురకలకు గలిగిన అపజయమునుగురించి ఢిల్లీలో తెలుస్తుంది. ఆహా

కారములు బహుద్వేరుతవి. అపజయమునకు అలఫ్‌ఖానే కారణమని అల్లాయుద్దీను కోపించి మరల సైన్యములను పంపుతాడు. ఖాన్‌హాడదే ముసల్మానుసైన్యమును నిర్మూలము చేస్తాడు. అల్లాయుద్దీను తోక దొక్కిన త్రాచువలె ఉగ్రుడై తానే సేనానాయకత్వమునువహించి సేనలతో బయలుదేరుతాడు. రాజపుత్రులు శత్రువును తిరస్కరిస్తారు. కార్యములేక అల్లా ఉద్దీను ఒకపన్నాగము పన్నుతాడు. గోవులనుచంపి వాటి మాంసమును మూటలుగట్టి కోటలోని సరస్సులో పడేటట్లు చేస్తాడు. రాజపుత్రులు తమకు త్రాగుటకాధారమైన సరస్సు అపవిత్రమౌటను చూచి స్త్రీలనందరినీ జౌహరు చేయమంటారు. రామ నామమును స్మరిస్తూ స్త్రీలు అగ్నిలోపడి నశిస్తారు తనకు లోబడవలసినదని పాదుషా కబురుచేస్తాడు. రాజు ప్రాణత్యాగమున కొప్పుకొంటాడుకాని అవమానమున కొప్పుకోడు. రాజపుత్రయోధులందరూ స్నానములు చేసి సాలగ్రామమునుపూజించి, రామనామమునుజపించి తులసీ మాలలుధరించి ఏకదీక్షతో తురకలమీదపడతారు. ఘోరముగా యుద్ధముచేసి అందరునూ నశిస్తారు. ఖాన్‌హాడదే ఇంకనూ పాదుషాకు లొంగడు. ముసల్మానుసైన్యములు, ఝాలోరావద్ద విడిసినవి. అల్లాఉద్దీను కూతురు తిరోజా ఖాన్‌హాడదేకొడుకైన వీరమదేవునిచూచి మోహిస్తుంది. తన్ను పెండ్లాడమని వర్తమాన మంపుతుంది. రాజపుత్రుడు నిరాకరిస్తాడు. పాదుషాకు కోపము ఇనుమడిస్తుంది. ఖాన్‌హాడదే సుల్తాను సైన్యముల మీదపడి తరుముతాడు. తిరోజా తన తండ్రితో వీరమదేవుడు పూర్వజన్మములో తనకు భర్తఅనిన్నీ,

అతడున్నూ, ఖాన్‌హడదేవుడున్నూ, తానున్నూ అచిరకాల ములో మృతినొందుతామనిన్ని తెలుపుతుంది. వీరమదేవుని మోహవలెనని బయలుదేరి ఒకసరస్సు ఒడ్డున విడుస్తుంది. అచ్చట ఖాన్‌హడదేవున్నూ వీరమదేవుడున్నూ ఆమెను కలుసుకుంటారు. తన్ను ప్రేమించవలసినదని తిరోజా అతనిని ప్రార్థిస్తుంది. వీరముడొప్పుకోడు. ఎటులైనా సంధినికుదుర్చవలె ననికోరి తిరోజా ముసల్మాను సైన్యములమీదికి ఆరాత్రి పోవలదనికోరుతుంది. సుల్తాను దేవాలయములను పగుల గొట్టకుండా, దేశమును దోచకుండా, బ్రాహ్మణులను బాధ పెట్టకుండా, గోహత్య చేయకుండా ఉంటే తాము ముసల్మా నుల మీదికి పోమని రాజపుత్రు లభయమిస్తారు. ఝూలోరా కోటలోనికిపోయి సమస్తమునూ చూస్తుంది. పాదుషాకు ఇదంతా ఇష్టములేకపోతుంది. కాని ఎనిమిదేండ్లలో ఝూలోరా పట్టణము పాదుషా వశమవుతుందని ఆమె భవిష్యత్తును చెప్ప డముచేత అల్లాఉద్దీను ఎనిమిదేండ్లున్నూ ఊరుకొని తర్వాత సైన్యములను పంపుతాడు. ముసల్మాను సైన్యములోడిపోతవి. పన్నెండేండ్లు ముసల్మానులు కోటనుముట్టడిస్తారు. కోట తురకలకు స్వాధీనముకాదు. తుదకు ఒక పల్లకీమోసేవాడు ద్రోహియై కోటలోనికి రహస్యమార్గమును తురకలకు చెబు తాడు. ఆభోయవాని భార్య అది తెలిసికొని వానిని చంపి రాజుతో చెప్పుతుంది. తురకలుకోటలో ప్రవేసిస్తారు. అచ్చట తిరిగి రామాయణయుద్ధము జరుగుతుంది. ఖాన్‌హడదే యుద్ధ ముచేస్తూ హతుడౌతాడు. రాణులందరున్నూ జౌహారు చేస్తారు. వీరముడు ఖడ్గహస్తుడై పోరాడి తానున్నూ మృతి

బొంకుతాడు. వీరముని తలనునరికి బంగారు పళ్లెములోనుంచి తిరోజా ఎదుటపెడతాడు. ఆమె ప్రియుని మొగము చూడగానే ఆతల మొగము వెనుకకు తిరిగిపోతుంది. ఆమె ఆతలకు పూజచేసి యమునలోనికురికి స్వర్గములో తన ప్రియుని చేర బోతుంది.

---

# తృతీయాధ్యాయము

## పౌరాణిక వాఙ్మయము

ముసల్మానులు గుజరాతుదేశమును జయించిన తరువాత, ఆ దేశములో హిందూసంస్కృతికి గొప్ప దెబ్బ తగిలినది. పూర్వమువలె దేశీయవాఙ్మయమును పోషించే ప్రభువా దేశములో లేకపోయినాడు. స్వీయమతముమీదను ధర్మముమీదను హిందువుల కభిమానము క్షీణించుచు వచ్చినది. ముసల్మాను ప్రభువులను సేవించి యెట్లో పొట్టపోసుకొనడములోనే జనులు కాలము వెళ్ళబుచ్చుకొనవలసివచ్చినది. పూర్వమువలె సంస్కృత ప్రాకృత విద్వాంసులు లేకపోయినారు. పండితులును, కవులును ఆదరములేక ఇతరదేశములకు పోయి, ఇతర రాజుల నాశ్రయించుకొన్నారు. 1411 నుంచి 1573 సం॥రమువరకున్ను గుజరాతుదేశము అహమ్మదాబాదు సుల్తానుల ఆధీనములో ఉన్నది. ఆ తరువాత 1707 సం॥రము వరకున్ను మొగలాయీచక్రవర్తుల పరిపాలనకు లోబడినది.

చిరకాలమునుంచిన్నీ శ్రుతి, స్మృతి, పురాణేతిహాస ముల మూలముగా హిందూ ధర్మము కాపాడబడినది. ఈ వాఙ్మయమంతా సంస్కృతములో ఉండి బ్రాహ్మణుల ఆధీనములో ఉండేది. శ్రుతిస్మృతులలో నిష్ణాతులయినవారు దేశమునుంచి రాజకీయ పరిస్థితులవల్ల వెడలిపోయినప్పుడు హిందూధర్మమును పురాణముల మూలముగా బ్రాహ్మణులు నిలువబెట్టినారు. ఇప్పుడు పురాణములు సంస్కృతములో అర్థము చేసుకొనేవారు లేకపోవడము చేత, వాటిలోని కథలను ధర్మములను జానపద వాఙ్మయముగా గేయరూపముగా దేశ ములోని వ్యావహారిక భాషలోని కనువదించి బ్రాహ్మణులు హిందూధర్మప్రచారమును చేయ నారంభించినారు.

ఇట్టి పురాణవాఙ్మయము గుజరాతీలో అభివృద్ధి పొంద డమునకు పధ్నాలుగో శతాబ్దములో బయలుదేరిన భక్తిసంప్ర దాయము తోడ్పడినది. దక్షిణహిందూదేశములో త్రిమతము లున్ను బయలుదేరినవి. శంకరాచార్యు డద్వైతమతమును బోధించినాడు. రామానుజుడు విశిష్టాద్వైతమును, భక్తిని దేశ ములో వ్యాపింపజేసినాడు. మధ్వాచార్యులు ద్వైతమును బోధించినాడు. ఈ ముగ్గురు ఆచార్యులున్ను భారతవర్షమంతా సంచారముచేసి తమ మతములను బోధచేసి, అక్కడక్కడ మఠములను స్థాపించినారు. ఈ మూడు మతములలో అద్వై తము కేవలము పండితులైన విద్వాంసులకుమాత్రము తలకెక్కి నది. "ప్రపంచము మిథ్య, నీవు మిథ్య, నేను మిథ్య, అంతా మిథ్య, సమస్తమును భ్రాంతిమూలము" అనే వాదము నిత్య మున్ను ప్రపంచములో బాధల ననుభవిస్తూ ఉండిన సాధారణ

జనులకు నచ్చినది కాదు. పరమాత్ముని భక్తికైంకర్యములే మూలముగా సాన్నిధ్యమునకు చేర్చుకోవచ్చును అనే బోధ వారికి నచ్చినది. జనుల మనస్సు భక్తివంకకు తిరిగినది. కొంద రికి పని కలిగించే అద్వైతముకంటె హృదయమున కానం దము కలిగించే విశిష్టాద్వైత ద్వైతమతములే వారి నాకర్షించినవి. ఈ రెండింటిలో విశిష్టాద్వైత మెక్కువ పని చేసినది. ఆ కాల మున రామానుజ మతానుయాయి అయిన రామానందు డనే భక్తశ్రేష్ఠుడు ఉత్తరహిందూస్థానమందంతటను సంచ రిస్తూ రామభక్తిని దేశమందంతటను వెల్లివిరియజేసినాడు. రామభక్తి మూలముగా ఒక్క విద్వాంసులు, పండితులు, ద్విజులునేకాక సమస్త జనులున్ను భవసాగరమును తరింప గలరని బోధ చేయ మొదలిడినాడు. బ్రాహ్మణులనుంచి ఛండాలురవరకున్ను అతని సందేశము చేరినది. జాతి వర్ణ వివక్షలేక అతనికి జనులు లక్షలకొలది శిష్యులు కాజొచ్చి నారు. అతని సందేశము హిందువులను మసల్మానులను సమా నముగా ఆకర్షించినది. అతని శిష్యులలో కబీరు సాలెవాడు; ఇతడు తొలుత మహమ్మదీయుడని కొందరంటారు. రైదాసు కర్మకారకులస్థుడు. సేనుడు మంగలి. సద్నా కసాయివాడు. నరహరిదాసు బ్రాహ్మణుడు. వీరి భక్త్యావేశపూరితములైన గీతములతో తక్కిన ఉత్తరహిందూస్థానముతోబాటు గుజ రాతు కూడా మారుమ్రోగినది. వీరందరున్ను తమతమ సంప్ర దాయములకు మూలపురుషులై భక్తిమతమును ప్రబలజేసి నారు. వీరి శిష్యులీ భక్తివాహినిని తీరప్రాంతములకు తీసుకొని పోయి జనుల హృదయక్షేత్రములను మరింత ఫలవంతములుగా

చేసినారు. రైదాసు శిష్యుడైన నానకు సిక్కు మతమును స్థాపించి పంజాబులో వీరభారతవర్ష పునరుద్ధరణము చేసినాడు. నరహరిదాసు శిష్యుడైన తులసీదాసు 'రామచరితమానస' మును వ్రాసి రామనామమును దేశములో ప్రతిధ్వనింపజేసినాడు. సాధారణజనులకు తమ నిత్య వ్యావహారిక భాషలో చేసిన యీ భక్త్యుపదేశ మతిశీఘ్రముగా దేశమందంతటను వ్యాపించిపోయినది. కేవల పండితులకు గౌరవము తగ్గినది. దుర్గ్రాహమయిన సంస్కృతభాషమీద జనులకు మోజు తగ్గినది. తమ నిత్యవ్యవహారభాషమీద గౌరవము హెచ్చినది. ఈ మార్పునకీ భక్తిప్రచారకుల బోధనలు కూడా కొంత కారణ మయినవి. కబీరు అంటాడు :

"సంస్కృత హి పండిత కహై, బహత కరై అభిమాన,
భాషా జాని తీరక కరై, తే నర మూఢ అజాన,
సంస్కిరత సంసార మే, పండిత కరై వఖాన,
భాషా భక్తి దృఢా వహీ, న్యారా పద నిరవాన,
సంస్కిరత హై కూప జల, భాషా వహా తా నీర,
భాషా సతగురు సహీత హై, సతమత గహీర గభీర."

"పండితులు సంస్కృతముతో మాట్లాడుతారు; దాని మీద ఎక్కువ అభిమానము చూపుతారు వ్యవహారభాషను మాట్లాడేవారిని తక్కువ చేసి, వారె నజ్ఞాను లంటారు. ప్రపంచములో పండితులు సంస్కృతములోనే వ్యాఖ్యానము చేస్తారు. వ్యవహారభాషలో బోధింపబడిన భక్తియే దృఢముగా నిలుస్తుంది, నిర్వాణపదము నిస్తుంది. సంస్కృతము కూప

జలము వంటిది, దేశభాష నీరపూర్ణమైన ప్రవాహము. సగటు రుడు దేశభాషను ప్రేమిస్తాడు. దేశభాషమూలముగా మిక్కిలి లోతయిన సంస్కృతముయొక్క అర్థము తెలుస్తుంది” అని.

సంస్కృతభాషమీద ఇందుమూలముగా గౌరవము తగ్గినదని అనుకోకూడదు. ‘అభావే విరక్తిః’ అన్నట్లు ఆభాష అందరాని పండుకాగా, జనులు దేశభాషనే ఆదరించినారని చెప్పడమే యుక్తము. సంస్కృతవాఙ్మయస్థములయిన విష యములను జనులువిస్మరించలేరు. శ్రుతులు, స్మృతులు, పురాణములు, ఇతిహాసముల మూలముగా భారతవర్షములో ప్రబలిన సంస్కృతి జనులుజీవితములో అంతరాంతరములకు ప్రాకి చిరస్థాయి అయినది. అదియే వారి జీవితమునకు జీవితము. జీవితములోని ప్రతిచిన్నవిషయములోను అది ప్రతిభవిస్తూనే వున్నది. దానిని వ్యక్తముచేసే దర్పణము కావలసివచ్చినది. ఆనాటి భక్తులున్ను పౌరాణికులున్ను దేశభాషనే ఆదర్పణ ముగా చూపించినారు.

గుజరాతులో భక్తిప్రతిపాదకమయిన గేయవాఙ్మయ మునుగురించి ప్రత్యేకముగా తరువాతి అధ్యాయములో తెలుపబడును. ఇచట గుజరాతులో బయలుదేరిన దేశీయ పౌరాణిక వాఙ్మయమునుగురించి సంగ్రహముగా చెప్పు తున్నాము. పల్లెలలోను పట్టణములలోను పురాణపఠనము చేయడము నేటికిన్ని సర్వసాధారణముగానున్నది. కాని తెలుగు దేశములోని పురాణపఠన విధానమునకున్ను, గుజరాతులోని విధానమునకున్ను చాలా భేద మున్నది. తెనుగుదేశములో

పురాణకథా ప్రచారము హరికథలమూలముగాను, ప్రత్యేక పురాణపఠనము మూలముగాను రెండువిధములుగా జరుగుతుంది. హరికథలు హరిదాసులు రచించినవి. వాటిని తత్కర్తలయినా, వారిఅనుయాయులయినా తాళమృదంగాదివాద్య సహితముగా గానప్రధానముగా నృత్యసహితముగా సాగిస్తారు. పురాణపఠనములో ఇట్టితంతు ఉండదు. పూర్వకవి రచిత గ్రంథములో ముఖ్యముగా భారత, భాగవత, రామాయణములును, ఒకొక్కపద్యముగా ఒకడు చదువుతూ చదువుతూఉంటే, మరి ఒకడు దానిఅర్థమును చిలవలకు పలవలూపన్ని, అనేకములైన దృష్టాంతములతోను, ఉపకథలతోను పౌరాణికుడు సాగిస్తాడు. ఈవ్యాఖ్యానము మూలముగా హిందూ సంస్కృతి జనులలో వ్యాపిస్తుంది. పద్యములను రాగముతో చదువుతారు. వ్యాఖ్యానముచేసేవాడు తనమాటలనుకూడా ఆరాగములోనే అనుసరించి చెప్పుతాడు. ఒకొక్కొక్కప్పుడాతడు రాగము విడిచి కావలసినప్పుడు కేవలగద్యమార్గమున కూడా చెప్తాడు. పురాణపఠనములో పాటలుండవు. గుజరాతు దేశములో ఈపురాణపఠనము తెనుగులోని హరికథలకున్ను పురాణపఠనమునకున్ను సమ్మేళనరూపముగా ఉంటుంది. సాధారణముగా కథ పాటలరూపముగా ఉంటుంది. మధ్యమధ్య పౌరాణికుడు వ్యాఖ్యానరూపముగా కొంతగద్యముకూడా సాగిస్తాడు. ఇట్టి పురాణకథ "ఆఖ్యానములు" అనేపేరు గుజరాతు దేశములో ఒకవాఙ్మయరీతిగా ఏర్పడినది.

ఈ ఆఖ్యానములను చెప్పేవారు గాగరి యాభట్టులు, లేక మాణభట్టులు అనే రెండుతెగలుగా ఉన్నారు.

ఈ భట్టులకు సాధారణముగా సంస్కృతము తెలియదు. గురువులనుండి ఆఖ్యానములు నేర్చుకొని ఇద్దరు శిష్యులను వెంటబెట్టుకొని పల్లెల్లో తిరుగుతూ ఉంటారు. గాగర లేక మాణ అనేపేరుగల సన్నని మూతిగల పెద్దరాగిబిందెమీద వాద్యముచేస్తూ పాటలు పాడుతాడు గనుక అతనికాపేరు వచ్చినది.

ఆఖ్యానములు రచించినవారిలో భాలణుడు ప్రథముడని చెప్పవచ్చును. ఇతడు బ్రాహ్మణుడు. పాటణపురవాస్తవ్యుడు. 1426 సంవత్సరమునకును 1500 కును ఇతడుండేవాడని చెప్పుతారు. ఇతడు మొదట శైవుడైయుండి రామానందీయుల భక్తిమార్గమునకులోనై రామభక్తుడైనాడు. ఇతడు మొదట కేవల పురాణోపాఖ్యానములను కథలుగా చెపుతూఉండేవాడు. కాని రాను రాను బాణుని కాదంబరి మొదలైన కథలనుకూడా ఆఖ్యానములుగా రచించినాడు. ఇతడు రచించిన ఆఖ్యానములో హరసంవాదము, మృగీ ఆఖ్యానము, సప్తశతి, అనేవి శివసంబంధములైన కథలు. హర సంవాదకథ శివపురాణములోనిది. గంగను జడలలోదాచిన శివుని ప్రేమను తిరిగి సంపాదించడానికి పార్వతి చెంచువేషమును వేసుకొని అతనికి ప్రియురాలైన కథ ఇందులో చెప్పబడినది. మృగీ ఆఖ్యానముకూడా శివపురాణములోనిదే. ఒకకిరాతుడు అనుదినమునుగానే శివునిపూజించి కైలాసము జేరినకథ ఇందులో చెప్పబడినది. సప్తశతికథ మార్కండేయ పురాణమునుండి తీసుకొనబడినది.

బాణుడురచించిన తర్వాతి ఆఖ్యానము కాదంబరి. బాణుని గద్యకావ్యములోని అందమును చెడగొట్టకుండా గుజరాతీ వారి జాతీయత కనుగుణముగా వర్ణనములను పెంచి కవి దీనిని రచించినాడు.

దీనినుండి ఒక్క ఉదాహరణము:-

ఖాత కంతీ ఎమ కహే, "సిద్ధార్థ గయు ఏ కాల,
హృది శరూ చాప్యు నహీం, చుంబన దేఈ బాల;
నాహోనా నాహోనా దంత బి, ని సుందర ముఖను వాన,
పుత్ర హసతు నహీం దీఠు, కరావతా పయ పాన;
చరణ వాగి ఘూఘరీ, అంగులీ వలగు జాయ,
ఏ సుఖ హూం పామీ నహీం! హావి కరూం కిసు ఉపాయ;
నే సాత్ థీ భణీ ఆవి. పాటీ ఖడీఉ హాథ,
ఆఇ! కహీం బోలావతు ఘరి బాల ధాలి బాథ్;
ఏ ఊరిఉ, వీతు నహీం, జే పుత్రమాతా నామ;"
ఏణీ పిరి షుని దుఃఖ ఆణి నిత్య పరతి, స్వామి.

ఓ రాజా! ఆమె మాట్లాడుతూ, "జీవితము వ్యర్థమౌతున్నది. నేను నా పుత్రుని ముద్దిడుకొనలేదు. వానిని నా హృదయమునకు చేరువగా చేర్చుకొనలేదు. పాలన్నము తినిపిస్తూ వాని రెండు చిన్నిపండ్లతో సుందరమైన స్మేరాననమును చూడలేదు. తప్పటడుగులు వేయుచున్న వాని కాలిగజ్జెల రవళిని హృదయానందకరముగ నేను వినలేదు. అహా! నేనేమి చేతును. చేతిలో సిరాబుడ్డినీ, పలకనూ పట్టుకొని ఇంటికి నావద్దకు పరుగునవచ్చి: అమ్మా! అని నన్ను కౌగ

లించుకొను నాముద్గా కుమారుని నేను చూడ నోచుకోలేదు. నా హృదయము తల్లుల ఆనందమును కోరుచున్నది. కాని నా కోరిక సిద్ధించదు.

భాలణుడు తర్వాత రచించిన గ్రంథము నలాఖ్యానము. దీనిలోని కథను మహాభారతమునుంచి, శ్రీహర్షుని నైషధము నుంచి, త్రివిక్రముని నలచంపువునుంచి కూడా తీసుకొన్నాడు. భాలణుడు రచించిన ఇతర గ్రంథములలో రామవిరహము, రామబాలచరితము, అనేవి రామాయణకథలు, జాలంధరాఖ్యానము పద్మపురాణము లోనిది. దుర్వాసాఖ్యానము మహాభారతాంతర్గతము. ధ్రువాఖ్యానము, రుక్మిణీహరణము, సత్యభామా వివాహము, కృష్ణవిష్టి కృష్ణబాలచరితము, దశమస్కంధము, అనేవి భాగవతపురాణము లోనివి. శ్రీకృష్ణచరిత్రాత్మకమైన కథలలో భాలణుడు గరబీలను ఎక్కువగా ఉపయోగించినాడు. వాటి ప్రసిద్ధినిబట్టి తరువాతి కవు లందరున్నూ వాటినే అనుసరించినారు. భాలణుడు రచించిన ఈ క్రింది గరబీ నిప్పటికిన్నీ గుజరాతీలు పాడుతూ ఉంటారు

మీఠతా మావజీ రే, మారే మందిర ఆవో;
ప్రేమే పీరసు పరమానంద, కుర నే దూధ శిరావో.
మథురా ఋద్ధి పామ్యా ఘణీ, వాధ్యూం ఛే అతి తేజ రే;
నహీ జాణజో మారా సరఖూ, కో నహీ ఆణే హేజ.
ధవరావీ నే హైడే చాంపతీ, త్యామ దేవకీ నహీ చాంపే రే;
రోమాంచిత మారీ దేహడి థాతీ, త్యమ తేనీ నవకాంపే.
మాతా నహీ థాఉ త మారీ, ధావ కిహీ నే జావో రే;

షు భాఖ్యోం జే పాఖణ మాళ్ళే, తేణే రోష భరావో.
కాళిన్ద్రే మాంఘో తను ఉపర, జే హుం నవ ఝూపావి రే;
జాణుం ఖ్యం తే వాత సంభారీ. రీస మన మాం తే ఆవీ.
తేం కన్థా త్యాం కోయ జే నహీ, ప్రీత కరీనే ఛేహా రే;
భాలణ్ప్రభు రఘునాథ సంభారో, ఏక ఘడీనో నేహా.

భాలణుడు రచించిన ఆఖ్యానములను మించినవి ప్రేమానందుడు రచించినవితప్ప మరి లేవు. మంత్రికర్మణుడు (1470) సీతాహరణమును వ్రాసినాడు. పాటణ వాస్తవ్యుడైన కేశవహృదిరాముడు దశమస్కంధమును రచించినాడు. సిద్ధపుర వాసి ఐన భీముడు 1484 హరిలీలాషోడశకల మొదలైన ఆఖ్యానములను రచించినాడు. ఇట్లే అనేకులు భాగవతము, రామాయణము, సప్తశతి, మొదలైన వాటిరీతిగా అనేక ఆఖ్యానములను వ్రాసినారు. వీరిలో బరోడావాసియైన నాకరుడు (1550) ముఖ్యుడు. ఇతడు మహాభారతములోని చాలా భాగములను అనువాదము చేయ ప్రయత్నించినాడు.

పౌరాణికాఖ్యానముల మూలముగా జనులలో ఈరీతిగా ఆర్యసంస్కృతి స్థిరమవుతూ ఉండగా దేశములో సాంఘికముగా అనేకములైన మార్పులు కలిగినవి. గుజరాతు మొగలాయీసామ్రాజ్యములో అంతర్భాగమైనది. అక్బరు కాలము నుంచియే దేశములో స్థిరప్రభుత్వమేర్పడినది. యుద్ధములంతగా లేకుండేవి. కాని ఔరంగజేబు సింహాసనమునకు వచ్చిననాటినుంచియే మరల అల్లరులు ఆరంభమైనవి. శివాజీ మొగలుసామ్రాజ్యనాశనమునకు పూనుకొన్నాడు.

మహారాష్ట్రుల [illegible] తక్కువ ఐనవి. మొగలు సైన్యములు పరాజితములైనవి. మొగలుసామ్రాజ్యము క్షీణించ జొచ్చెను. ఇట్టిసమయములో సంఘము క్రొత్తఆచారములను అవలంబించినది. విశిష్టవర్ణములవారు చిన్న చిన్నశాఖలుగాను, ఉపశాఖలుగాను విడిపోయి భోజన బాంధవ్యముల విషయములలో ఇతర శాఖలవారితో సంబంధమును వదలుకొన్నారు. వ్యక్తి స్వాతంత్ర్యము క్షీణించినది. శాఖా సంప్రదాయము ఘనీభవించినది. అతిబాల్యవివాహములు ప్రబలినవి. బహుభార్యాత్వము వ్యాపించినది. వైధవ్యము హెచ్చినది. విధవా వివాహములు నిషేధింపబడినవి. ఇట్టి మార్పులు హిందూ సంఘ క్షీణతకు చిహ్నములు కావు. ఆ కాలములో హిందూ సంఘము ఛిన్నాభిన్నము కాకుండ నిలబడుటకు ఆ యా సంఘము లవలంబించిన ఆచారములు. ఇవి అన్ని మనకు నేడు దోషములుగా గనబడినా, ఆనాడవి అవశ్యకములై ఉండేవి. వివిధశాఖలవారున్నా ఏశాఖవా రాశాఖలో సౌఖ్య జీవనము చేస్తూ ఉండేవారు. ఒక శాఖవారు మఱియొక శాఖ వారితో వైరమును పెంచుకొనక పరస్పర సహకారులై యుండేవారు. సంఘము స్వాతంత్ర్యమును గోలుపోయినా ఇతర మతముల నెదిరించే శక్తిని సంపాదించుకొన్నది.

రానురాను ముసల్మాను ప్రభువుల ఏలుబడికి ప్రజ లలవాటు పడినారు. ఈ ప్రభువులలో ననేకులు హిందూమతము నుండి ఇస్లాములో చేరినవారే. వీరికి హిందువులను తమ మతములోనికి చేర్చుకొనవలెననే ఉత్సాహము తగ్గిపోయినది.

ప్రజల అభిమానము లేకపోతే తమ ప్రభుత్వము సాగదని వారు గుర్తించినారు. పూర్వమువలెకాక యిప్పుడు భక్తికి ప్రాధాన్యము తగ్గినది. పూర్వమువలె ఖాన్ హాడజేవంటి వీరులు కానీ, నరసింహ మెహతా వంటి భక్తాగ్రేసరులు కానీ కరవైనారు. భక్తి వీరములు లేని బ్రతుకు రోకటిపాట యైనది. జీవితమువిూద రోత పుట్టినది. ఐహిక జీవనమువల్ల లాభము లేదనిన్నీ, అందుచున్నూ పరలోకజీవనముకోసమే ప్రయత్నించవలసినదనిన్నీ ఆచార్యులు బోధచేయ నారంభించినారు.

ఇట్టి సాంఘికదృష్టిని నెలకొల్పుటకు దోడ్పడినవారిలో 'అఖో' లేక 'అఖాభగత' (1615–1674) అనేవాడు ముఖ్యుడు. ఇతడు కంసాలి. కొన్నాళ్ళు చక్రవర్తి టంకసాలలో ప్రధానోద్యోగిగా పని జేసినాడు. ఇతనికి చిన్నతనములోనే భార్యయున్నూ, తానెక్కువగా ప్రేమించిన చెల్లెలున్నూ చనిపోయినారు. కంసాలులకు పశ్యతోహరులని పేరు. ఐనా అతడు ఒకనాడు ఒక స్త్రీ నగ చేయుమని తనకు బంగారమిస్తే తన బంగారమునే కలిపి ఆమెకు నగ నిచ్చినాడట. ఆమె దానిని గీటు పెట్టించి చూచుకొని కంసాలి ఈరీతిగా చేయడమున కాశ్చర్యపడి అతనికి తన కృతజ్ఞతను దెలుపడానికి పోయినదట. అఖోకు ప్రపంచములో మనుష్యులమీద నమ్మకము లేనందుకు విచారము కలిగినది. బ్రతుకుమీద రోతపుట్టి తన వృత్తిని వదలి మనశ్శాంతిని సంపాదించడానికి దేశసంచార మారంభించినాడు. ఎన్నో ప్రార్థనలు చేసినాడు. కార్యము లేకపోయినది ఎన్నో వ్రతము లాచరించినాడు.

గోస్వామినుండి అధ్యాత్మతత్త్వమును తెలుసుకొనడానికి గోకులమునకు పోయినాడు. అక్కడ ఆ గోసాయి అధోకు విందులు చేసినాడు. కాని గురువుమీద అతనికి భక్తి కుదురలేదు. వాడు కూటసన్యాసి అని అతనిని విడిచిపెట్టినాడు. అక్కడ నుండి కాశీకి పోయి ఒక గోడచాటున నుండి శంకరాచార్యుని అద్వైతబోధను వినడము సంభవించినది. ఆ బోధ అతనికి నచ్చినది. వెంటనే వైరాగ్యము పూని సర్వసంగపరిత్యాగమును చేసినాడు. అచటినుండి ఇంటికి పోయి శంకరాచార్యుల గ్రంథముల నన్నిటినీ చదువుకొన్నాడు. అఖేగీతము, చిత్తవిచిత్ర సంవాదము, కంచీకరణము, గురుశిష్య సంవాదము, అనుభవబిందువు, కైవల్యగీత, పరమపదప్రాప్తి అనే గ్రంథములను గుజరాతీభాషలోనూ పంచదశీతాత్పర్యము, బ్రహ్మలీల, అనే గ్రంథములను హిందీలోనూ వ్రాసినాడు. అఖాభగతుడు తాను గొప్ప కవి ననుకోలేదు. ఇతరులు కూడా అతనిని కవిగా ఎంచరు. సంస్కృతమంటే అతనికి కిట్టదు. జ్ఞానులమని పేరుపెట్టుకొని సంస్కృతము నుపయోగిస్తూ డాంబికముగా ప్రవర్తించేవారిని చూస్తే అతనికి కోపము. "కవులు రోహిణీ కార్తిలో మేఘములు గర్జించినట్లు వృథా గర్జనము చేస్తూ ఉంటారు. ఇతరులు తమ్ము గౌరవించడమే వారికి కావలసినది. పద్యమునకు పద్యము చేర్చి గుడ గుడ ధ్వని చేస్తుంటారు. వారికి బ్రహ్మజిజ్ఞాస లేదు. ప్రేమ ద్వేషములకు లోనై వారు ధనార్జనపరులై యుంటారు. దీనివల్ల వారి కేమిలాభము?"

మతబోధకులమీద కూడా అతనికి నమ్మకము లేదు. "వీరు లోతైన బావినుంచి చిల్లులుపడిన చేదతో నీరు చేదుతారు.

[illegible] [illegible] చూపించుటకు కోరిక గలిగిన గయ్యాళివంటి వాడు. ఇతరుల పొలములలో మేసి పొగరెక్కిన ఎద్దువంటి వాడు. పిచ్చికుక్కవంటివాడు, కల్లు త్రాగిన కోతివంటివాడు. నీవు నీవే గురువువు కమ్ము. నీలోని అంతరాత్మను సేవించు."

మతచిహ్నములు కూడా అతని కిష్టము లేదు. దేహము నిండా నామములు దిద్దుకొని 58 ఏండ్లు బ్రదికినాను. నా మెడ లోని తులసిమాలలు గుండెలమీద అరిగిపోయినవి. తీర్థ యాత్రలకు తిరుగలేక అడుగులు బొబ్బలు లేచినవి. ఇంకా నేను హరికి చేరువగా పోలేదు. పురాణములను విని విని చెవులు చిల్లులు పడినవి. కాని అఖాకు బ్రహ్మజ్ఞాన మింకా కలుగలేదు."

తాము పూజిస్తూన్న రాళ్లెన్నున్నవో అంతమంది దేవత లను ప్రార్థించే జనులను జూచి అతడు వెక్కిరిస్తాడు. "ఈ జనులు జవసత్త్వము లుడిగి, ధనమంతా పోయి, వృద్ధు లైన తర్వాత హరినామస్మరణ ఆరంభిస్తారు. మత మన్నేది కార్యములేని కొట్లాట. ఒకడు రాము డంటాడు, ఒకడు అల్లా అంటాడు. వైష్ణవుడ నని గర్వించకు. ఇంటింటికినీ దిరిగి పొట్ట నిండా విందు లారగించకు. ప్రజలను రక్షించేవాడే రాజు. రాజనామకుడు రాజు కాడు."

నిమ్న జాతులను క్రిందికి త్రొక్కి బ్రాహ్మణులనూ, వైశ్యులనూ ప్రభువులుగా చేసే సంఘనిర్మాణ మాతని కిష్ట పడలేదు. "నారాయణునికి ఎక్కువ తక్కువ అనే భేదము లేదు. ఈ ప్రపంచము పంచభూతాత్మక మైనది. మూర్ఖుడు

తన వర్ణమునకు గర్విస్తాడు. జాతిసిద్ధాన[illegible]చించడానికి ఒకడు తల, ఒకడు నడుము, ఒకడు పాదములు అని చెప్పి నాడు. కాని నిజముగా బ్రాహ్మణుడు, క్షత్రియుడు, వైశ్యుడు, శూద్రుడు అందరున్నూ [illegible]పుత్రులే. ఐతే శూద్రు డెవడు ?”

పౌరాణికులంటే అతడు నీచముగా చూస్తాడు. “పూర్వ కాలములో ఏనాడో చచ్చినవారి ద[illegible]సము పీకు పాకు లాడుతారు. చచ్చిన శవముల గురించి చదివే ఈ పౌరాణికు లకు సౌఖ్య మెక్కడిది.”

అఖో సిద్ధాంత మిది. “అనుభవించేవానికి కల్లమందున్నూ ఐహిక జీవనమున్నూ సమానములు. వాటి నెంత ఎక్కువగా రుచిచూస్తే అవి అంత ఎక్కువ రుచిగా కనబడుతవి. వాటిని విడిచిపెట్టితే వాడు చస్తాడు. వాటిని సేవించినా చస్తాడు.”

అఖో బోధనలు నవీన యుగమువరకున్నూ మ్రోగు తునే ఉన్నవి. రాజకీయముగానూ సాంఘికముగానూ, దిక్కు తెలియని సంఘమునకు ఇట్టి బోధనలు రుచించడము వింత కాదు.

# చతుర్థాధ్యాయము

## భక్తి వాఙ్మయము

భాగవతపురాణము ఆర్యవాఙ్మయములో చాలా ముఖ్య మైనది. దానిలో ప్రతిపాదింపబడిన కృష్ణభక్తి దేశమందంతటా వ్యాపించినది. రామానుజుడు, రామానందుడు, కబీరు, తులసీ దాసు మొదలయినవారు రామభక్తిని భారతవర్షములో వ్యాపింపజేసినట్లే జయదేవుడు, చండిదాసు, మీరాబాయి, నరసింహ మెహతా మొదలయిన భక్తులు తమ గేయముల మూలముగా కృష్ణభక్తితో దేశమును వెల్లివిరియించినారు.

శ్రీకృష్ణుని బాల్యక్రీడల కావాసమయిన మధురబృందా వన ముండడము చేత గుజరాతు దేశము పవిత్రమయినది. కృష్ణ భక్తి దక్షిణదేశమునుంచి ఉత్తరహిందూస్థానమునకు ఓఢ్ర దేశముద్వారా బంగాళములోనికి వ్యాపించినది. పదకొండో శతాబ్దములో ఉమాపతి, పన్రెండో శతాబ్దములో జయ దేవుడు, తమ రాధాకృష్ణ ప్రేమగీతములతో బంగాళమును మారుమ్రోగించినారు. పధ్నాలుగో శతాబ్దములో చండిదాసు అనే నవద్వీప బ్రాహ్మణవిద్వాంసుడు తన సహజియాశాఖా సంప్రదాయము ననుసరించి ఒక తక్కువకులపు వివాహిత స్త్రీని ప్రేమింపవలసి ఉండి, 'రామీ' అనే ఒక చాకలిదానికి తన ప్రేమనంతా ధారపోసినాడు. తాను వ్రాసిన అత్యుత్త మములైన గీతముల నన్నిటిని 'రామి' కంకితము చేసినాడు.

"నీవే నా మతము, నీవే నా తలిదండ్రులు, నీవే నా త్రివిధ పూజలు, నీవే వేదములు, నీవే గాయత్రి, నీవే వాగ్దేవత అయిన సరస్వతివి, పార్వతివి" అని తన కీర్తనలలో ఒక దానిలో పాడినాడు.

ఇట్టి గీతములలోని భక్తికి పరవశుడై మధ్వసంప్రదాయస్థుడయిన మాధవేంద్ర-పురి మధుర-బృందావనమును సందర్శింప వచ్చినాడు. అచ్చట యమున ఒడ్డున ఉద్యానములలో తన మనోనాయకుడైన శ్రీకృష్ణునికోసము విరహిణివలె పలవరిస్తూ, గానము చేస్తూ, నృత్యము చేసినాడు. కొంత కాలమునకు ఈశ్వరపురి అనే సన్యాసివద్ద ఉపదేశము పొంది, 'నిమాయి' కృష్ణభక్తుడై బృందావనమునకు వచ్చి మైమరచి కృష్ణుని నాయకుని చేసి, తాను విరహిణీ నాయిక అయి నృత్యము చేయడము మొదలుపెట్టినాడు. ఇతడే గౌరాంగ నాథుడయిన చైతన్యుడు-ఇతని మూలముగా వైష్ణవమతములో గొప్ప విప్లవము కలిగినది.

మీరాబాయి కృష్ణభక్తి సంప్రదాయమునకు చెందిన వారిలో అగ్రగణ్యురాలు. ఈమె రాజపుత్రస్థానములోని మేడ్తా రాజయిన రావు దూదాజీకి మనుమరాలు. ఈమె సుమారు 1500 సం॥ర ప్రాంతమున జన్మించినది. ప్రసిద్ధ వైష్ణవభక్తుడయిన తాత నుండి ఆమెకును భక్తి చిన్నప్పటి నుంచియే కుదురుకొన్నది. చిత్తోడా రాజయిన రాణాసంగుని కొడుకున కిచ్చి యామెకు పెండ్లి చేసినారు. కాని, ఆమెకు చిన్నతనములోనే వైధవ్యము ప్రాప్తించినది. అప్పటినుంచియే

ఆమె సాధువులతోను, భక్తులతోను తిరుగుతూ, శ్రీకృష్ణ గానము చేసుకొంటూ చేసుకొంటూ తిరుగడ మారంభించినది. ఆమె భర్త తమ్ముడయిన విక్రమున కామె యిట్లు తిరుగడము సరిపడలేదు. ఆమె నెన్నోవిధాల బాధించినాడు. ఆమె వినలేదు.

"అబ తో మేరా గిరిధర గోపాల, దూసరా న కోఇ,
మాతా ఛోడీ పితా ఛోడే, ఛోడే సగా భాయి,
సాధు సంగ బైఠ బైఠ లోకలాజ ఖోఇ,
సంత దేఖ దౌడ ఆఇ,
ప్రేమ ఆంసు డాల డాల, అమరవేల బోఇ.

... ... ... ...

అబ తో బాత ఫైల గఇ, జానే సబ కోఇ,
దాస మీరా లాల గిరిధర, హోనీ సో హోఇ."

"గిరిధర గోపాలుడు నావాడు, మరి ఒకడు కాడు ; నేను తల్లిని తండ్రిని సోదరుని విడిచిపెట్టినాను. సాధుసంగతిలో లజ్జ నంతటిని విడిచిపెట్టినాను. సాధువుల నాహ్వానించడానికి పరుగెత్తుతాను. ప్రపంచమును చూచి, నేను కన్నీళ్ళు విడుస్తాను. భక్తి అనే అమృతవల్లికి నా కన్నీళ్లు పోసి పెంచినాను. కావలసిన కార్యమయినది, అది అందరికిన్ని తెలుసును. గిరిధరదాసి, మీరా 'జరుగవలసినదేదో జరిగినది' అంటున్నది" అని సందేశ మంపింది. రాణా ఆమెను చంపవలెనని ప్రయత్నము చేసినాడు. ఆమె రాజపుత్రస్త్రీలోకమునకు

కళంకమని తలంచినాడు. ఆమె జాగ్రదవస్థలో ఉన్నప్పు
డంతా విరహిణి అయిన గోపికగా కృష్ణునికోసము పలవించేది.

"దర్ద న జానే మేరా కోఇ రే, మేరా కోఇ;
ఘాయల కీ గత ఘాయల జానే, జా శిరబీతీ హోఇ;
జల బినా జేసే మఛలీహీ తలపే, సో గత మేరీ హోఇ;
సూలి ఉపర సేజ హమారీ, తాపర రహీంవ్రు సోఇ;
మీరాకో దుఃఖ జబ మీటేగో, బద శామరో వోహే.

"నా బాధ ఎవ్వరికిన్ని తెలియదు, ఎవ్వరికిన్ని తెలి
యదు. గాయము పడినవారే గాయము తగిలినవారి బాధను
తెలుసుకోగలరు. చేపవలె నీటికోసము తపిస్తున్నాను. ముండ్ల
శయ్యపై పరుండి ఉన్నాను. శ్యాముడు, నా వైద్యుడు వస్తేనే
మీరాకు బాధ పోతుంది" అని పాడినది. కృష్ణునిపై ఆమెకు
గల ఉత్కంఠ అపారమైనది.

"కానుడే న జాణీ మోరీ పీర, బాఇ హుం తో
బాళకువారీ రే,—కానుడే...,

జలరే జమునా అమే పాణీదా గయా తా వాహోలా,
కానుడే ఉడాడ్యా ఆఛానీర;
ఉడ్యా ఘరరరర రే,—కానుడే...,

వృందారే వనమా వా కే రాస రచ్యో ఛే,
సోలసే గోపీనా తాణ్యా చీర;
ఫాట్యా చరరరర రే,—కానుడే...,

హు వరసాగీ కహానా తమరారే నామనీ రే,
కానుడే మార్యా ఛే అమనే తీర;
వాగ్యా అరరరర రే—కానుడే....,

బాఈ మీరాకే ప్రభు గిరధన నాగర,
కానుడే బాళీనే ఫేంకీ ఉంచే గిర;
రాఖ ఉడే ఫరరరర రే—కానుడే....

"కృష్ణునికి నా వలపు, నా కన్నెవలపు తెలియదు. అతడు యమున నుంచి నీరు తేబోయినాడు. మా అందరి మీదను నీరు చిమ్మినాడు. మా చుట్టును నీరు చెదరినది.

ప్రియుడు బృందావనములో రాసక్రీడ చేసినాడు. పదహారువందల గోపికల చీరలను పట్టి లాగినాడు. చీర లన్నీ చినిగిపోయినవి.

కన్నా! నీకోసము నాకు పిచ్చియెత్తినది. నీవు నామీద బాణములు ప్రయోగించినావు. ఆ బాణములు నన్ను దూసుకొని పోయినవి.

మీరాబాయి అంటుంది: "గిరిధరా! ప్రభూ! కృష్ణుడు నన్ను దహించివేసినాడు. ఆమె బూడిదను ఎత్తయిన కొండ మీదనుంచి విరజిమ్మినాడు. ఆ రేణువు లన్ని దిక్కులకున్ను పరుగెత్తుతున్నవి."

మీరాబాయిని రాణా పెట్టిన బాధ క్రిందికీర్తనలో వివరింపబడినవి :

"గోవిందో ప్రాణ అమారో రే, మనే జగలాగ్యో ఖారో రే;
మనే మారో రామజీ భావే రే, బీజో మారీ నజరే నఆవే రే;
మీరాబాఈనా మహేలమా రే, హరి సంతననో వాస,
కపటీ థీ హరి దూర వసే, మారా సంతనకేరీ పాస,
రాణోజీ కాగళ మోకలే రే. దో రాణీ మీరానే హాథ,
సాధునీ సంగతి ఛోడిదోగ్యో, తమో వసో నే అమారే సాథ,
విషనో ప్యాలో రాణే మోకల్యో రే, దేజో మీరానే హాథ,
రాజపాట తీమే ఛోడీ రాణాజీ, వసో సాధునే సాథ.
సాంథవాళా సాంథ ఇణగారజే రే, జావు సోసోరే కోశ,
రాణాజీనా దేశమారే మారే, జల రే పీథానో దోష,
డాబో మిల్యో మేవాడ రే, మీరా గఈ పశ్చిమ మాయ,
సరవ ఛోడీ మీరా నీసర్యా, జేను మాయామా మనడు
న కాయ,
మీరా హరినీ లాడణీ రే, రహేతీ సంత హజూర,
సాధు సంగతే స్నేహ ఘణో, పేలా కపటీథీ దిల దూర."

"గోవిందుడు నాప్రాణమురా, జగము నాకు దుస్సహముగురా,
రామ్‌జీనే ప్రేమింతునురా, మరియొక డెవ్వడు తెలియదురా,
మీరాబాయీ మహలునను, హరిసంతతి నివసించునురా,
కపటులు హరికిని దూరమురా, సాధులకును హరి చేరువరా,
రాణా జాబును పంపెనురా, మీరాచేతికి నిమ్మనెరా,
సాధువులను విడిపొమ్మనెరా, తనతో నుండను గోరెనురా,
మీరా జాబును పంపెనురా, రాణా చేతికి నిమ్మనెరా,
గద్దెను రాజ్యము విడుమనెరా, సాధులసంగతి మనుమనెరా,

విషపాత్రను రాణా పంపెనురా, మీరా చేతుల నిడు డనెరా,
అమృతం బనుచును త్రాగెనురా, విశ్వపతియు రక్షించెనురా,
ఒంటెవాడ! ఒంటెను తేరా, నూరు క్రోశములు పోవలెరా,
రాణా దేశములో నే, నీరు త్రాగుటయు దోషమురా,
మీరా మేవాడను విడిచెనురా, పశ్చిమమార్గము పట్టెనురా,
మీరా సర్వస్వము విడిచెను మనసును జగతికి దూరము చేసెనురా;
మీరా హరికిని ప్రియతమరా, సాధుసేవతో బ్రతుకునురా;
సాధులసంగతి సమ్మతిరా, ఆ. కపటి కామె యెడ దూరమురా.

మీరాబాయి కాథియావాడలోని ద్వారికను చేరు కొన్నది. ఆమె వెడలగానే చిత్తోడకు దురదృష్టదినములు ప్రాప్తించినవి. మీరా నిర్గమనమే దానికి కారణమని రాణా ఆమె మరల రావలసినదని బ్రతిమాలినాడు. ఆమె రా నిరాకరించినది. చిత్తోడలోని బ్రాహ్మణు లామె వచ్చేవరకున్ను ఉపవాసములు చేయ మొదలుపెట్టినారు. మీరా హృదయము కరగి కృష్ణాలయము ప్రవేశించి సెలవిమ్మని కృష్ణుని వేడినది. ఆమె కన్నీరు కార్చుతూ, పాటలు పాడుతూ, కృష్ణవిగ్రహములో సాయుజ్యమును పొందినది.

మీరా పాడిన పదము లుత్తరహిందూస్థానమం దంతటను యిప్పటికిన్ని మార్మ్రోగుతూ ఉన్నవి. ఆ పదముల లాలిత్య మనువాదమున కందదు. ఒక్క ఉదాహరణము చాలును :

"బోలే ఝీణా మోర, రాధే తారా డుంగరియా పర
బోలే ఝీణా మోర.

మోర హీం బోలీ బప్పైయా హీం బోలై, కోయల కరే
ఘనశోర, రాధే...;
...భవీ బీజళీ చమకే, బాదల హువా ఘనఘోర రాధే...;
ఝరమర ఝరమర మేహులో బరసే, భీజే మీరా
సాళుడానీ కోర, రాధే....;
బాఈ మీరాలాకే ప్రభు గిరిధరనా గుణ ప్రభుజీ హమారా
చితడానాచోర, రాధే...

"రాధా ! నెమలి కేక వేస్తున్నది; మయూరధ్వనులకు చెవులు చిల్లులు పడుతున్నవి. నెమళ్ళు పిలుస్తున్నవి; చిలుకలు పిలుస్తున్నవి; కోకిలలు పాడుతున్నవి; వాటి ధ్వనులు గాలిలో నిండుకొంటున్నవి. మెరపు మెరుస్తున్నది; మేఘములు ఘోరముగా గర్జిస్తున్నవి. మొయిళులనుంచి చిట చిట చినుకులు పడుతున్నవి. నిన్ను చేరవస్తూ ఉంటే నాచీర చెరగు తడిసినది. 'ఇది నా ప్రభువు గిరిధరుని లీల. నా ప్రభువు నా హృదయమును దొంగిలించినాడు' అని మీరా అంటున్నది."

మీరా మూలముగా గుజరాతులో కృష్ణభక్తి ఈరీతిగా అధిక మవుతూ ఉన్నకాలములోనే 'రుద్రసంప్రదాయము' లేక 'పుష్టిమార్గము' అనే క్రొత్త ఉద్యమము బయలుదేరినది. దీనిని స్థాపించినవాడు వల్లభాచార్యుడు. ఇతడు తెలుగు బ్రాహ్మణుడు. గొప్ప విద్వాంసుడు. ఇతడు గుజరాతుకువచ్చి 'వ్రజ'లో శ్రీనాథజీకి ఆలయమును కట్టించి, అనేక శిష్యులను తన చుట్టును చేర్చుకొన్నాడు. "భగవంతుడయిన శ్రీకృష్ణునకు సమస్తేంద్రియములను,ఆత్మను,హృదయమును,సర్వకర్మములను

అర్పించడమే కాక, భార్యను, ఇంటిని, కుటుంబమును, ధనమును, సకలమును స్వాధీనము చేయవలెను" అని యితడు బోధింపసాగినాడు. ఇతని కొడుకయిన విట్ఠలనాథుడీసంప్రదాయమును వ్యాపింపజేసినాడు. తన తండ్రియే కృష్ణుడని బోధింపసాగినాడు. ఆచార్యుడే స్త్రీపురుషులందరికిన్ని వల్లభుడు అతడే శ్రీకృష్ణుడు అని అతని అనుయాయులు విశ్వసించి, ఆచార్యునితో కలిసి రాసలీలలలో కాలము గడుపసాగినారు. ఈ విట్ఠలనాథుని శిష్యులలో ఒకడయిన గోపాలదాసు 'వల్లభాఖ్యాన' మనే కావ్యమును వ్రాసినాడు.

గుజరాతులో బయలుదేరిన యీ క్రొత్తభక్త్యుత్సాహమును మరింత ప్రబలజేసిన భక్తాగ్రేసరుడు నరసింహమెహతా (1500 – 1580). ఇతని జీవితమును గురించిన వివరము లీతని గ్రంథములందే కొన్ని కనబడుతున్నవి. ఇతడు జునాగఢమునకు సమీపములోనున్న తలాజా గ్రామములో జన్మించినాడు. వదనగరా నాగర శాఖకు చెందిన కృష్ణదాసు పుత్రుడు. తండ్రి నరసింహుని బాల్యములోనే చనిపోయినాడు. అందుచేత అతడు అన్న పోషణలో ఉండవలసివచ్చినది. అతనికి పెండ్లి చేయవలెననుకొన్నారు. కాని, నరసింహుడు సాధువులతో కలసి తానొక గోపిక అయినట్లున్ను, కృష్ణుడు తన ప్రియుడయినట్లున్ను భావించి, నృత్యము చేస్తూ పాటలుపాడుతూ ఉండడము చూచి, అతని జ్ఞాతియుల కతనిమీద కోపమువచ్చినది. ఏర్పరిచిన పెండ్లి తప్పిపోయినది. కాని, కొంతకాలమునకు మాణిక బాయి అనే కన్యనాతనికిచ్చి పెండ్లిచేసినారు. అతని వదిన కతడంటే పడేదికాదు. అతనిని సరిగా చూడక

అవమానిస్తూ ఉండేది. అవమానమును భరింపజాలక అతడు వేరే ఇల్లు చేసుకొన్నాడు. అతనికి 'కున్వరబాయి' అనే కూతురున్నది. 'శాములుడ' అనేవాడు కుటుంబమును పోషిస్తూ ఉండేవారు. అతడు తన చుట్టును స్త్రీలను పురుషులను చేర్చుకొని చిటితాళములను వాయిస్తూ రాధాకృష్ణభజన చేస్తూ ఉండేవాడు. కువర్‌బాయికి పెండ్లి అయినది ఒకకొడుకును కన్నది. శాములునికి పెండ్లి చేయవలసివచ్చినది. చేతడబ్బు లేదు. అతని చేతి చిటితాళములున్న కృష్ణభక్తి తప్ప నరసింహునికి నాది అనగలిగేది ఏమిన్ని లేదు. 'కృష్ణుడే నాకు సమస్తమున్ను ఇస్తాడు' అని ఉండే నరసింహునిచూచి అతని శాఖవారందరున్న నవ్వుతూ ఉండేవారు అయినా వేళకు ఎక్కడనుంచి అయినా సాయము కలుగుతూఉండేది. ఇదంతా దైవకృప అని భక్తులు నమ్ముతూఉండేవారు.

నరసింహుడు మూర్ఖుడు కాడు. కేవల కవికాదు. అతడు గొప్ప వేదాంతి. అతనికి విశ్వమానవ ప్రపంచములో భేదములు లేవు. దీనులను, దుఃఖితులను అతడు ఆశ్వాసిస్తూ ఉండేవాడు. కుటుంబగర్వము, జాతిగర్వము అతనికి లేవు. దరిద్రులకు, నిమ్నజాతులకు అతడు భక్తిప్రభావమును బోధచేస్తూ ఉండేవాడు. ఇవిఅంతా అతని శాఖీయులకు పడలేదు. ఒకనాడు నరసింహుడు ఢేద అనే నిమ్నజాతికి చెందినవారి యింటికిపోయి భజనచేయడముచూచి అతనిని సంఘమునుంచి వెలివేసినారు. తరువాతి కాలములో ఈవిషయమై నరసింహుని మహిమ చిహ్నముగా ఒకకథనుకల్పించినారు. ఒకనాడు

నరసింహుని శాఖవారయిన నాగరులు విందారగిస్తూఉంటే, ఒకొక్క ప్రక్కను ఒకొక్క ఢేడ జాతివాడుకూడా భోజనమునకు కూర్చునట్టయినదట. నాగరులప్పుడు నరసింహుని కాళ్లమీదపడి అతనికి వేసిన వెలిని తొలిగించినారట. ఇటువంటి కథలెన్నో నరసింహునిగురించినవి కలవు.

నరసింహునికి వృద్ధాప్యములో చాలకుటుంబకష్టములు కలిగినవి. భార్యచనిపోయినది. తరువాత కొడుకు మృతినొందినాడు. కూతురు విధవరాయినది. ఎన్నికష్టములువచ్చినా అతడు దుఃఖించలేదు. అతనికి కృష్ణుని మీద భక్తిచలించలేదు. పండుముసలి కాలమువరకున్న జీవించి అతడు కృష్ణసాయుజ్యమును పొందినాడు.

నరసింహుడు చాలాపదములను రచించినాడు. వీటిలో 740 'శృంగారమాల' అనేగ్రంథముగా ప్రకటింపబడినవి. చైతన్యునికిని మీరాకును వలెనే, నరసింహునికి కూడా కృష్ణుడు పెండ్లికొడుకు, తాను పెండ్లికూతురు.

వాసలదీ వా ఈ మారే బహావే, మందిరీమాం న ర హేవాయరే,
వ్యాకుల థఈనే వహాలానే, జోవా శు కరు ఉపాయ రే".

"నా నాథుడు వేణువు నూదినాడు. నేనొక్క క్షణము కూడా ఇంటిలో ఉండజాలను. నాకు పిచ్చెత్తుతున్నది. ఆతనిని చూడవలెను. ఏమిచేయవలెను;"

"కేమ జా జళ జమునా భరవా, వాసలదీఏ వేధాణీరే,
కామ ణగారో నేణ డబావే, లటకే హు లో భాణీరే;

"యమునానుంచి నీళ్లు తే నెట్లుపోదును? అతని వేణు నాదము నాలో చొచ్చుకొనిపోయినది. కామినీవల్లభుని కన్నులు నృత్యము చేస్తున్నవి. అతని అందము నన్నా కర్షిస్తున్నది".

" లోచన మాహే కామణ భరియా, తే థో హు నేహాను
కరియా రే,
కేము మంత్రిర జాఉ మారీ సజనీ, మారు మన ఏణే హారియు రే

"అతని కన్నులు నిరుపమానములైనవి. అతని కన్నులలో ఇంద్రజాలమున్నది. అవి నన్ను మోహముతో మంత్రించినవి. నే నింటికెట్లు పోగలను? అతడు నా చిత్తమును హరించినాడు."

"సాము బోలో శామళియా వహాలా, కహోనే క్యా గయా
తా రే,
హామణా హేంత ఉతార్యా హారజీ, ప్రేలీ నవల నరాను మన
మోహ్యా రే
తమో విణ అమే తలసి మరియే, శోల తమారు జోయు రే.

"నాథా, శ్యామలా, ఎక్కడకు పోయినావు, చెప్పు. ఈమధ్య ఈ నీ ప్రియురాలిని మరచిపోయినావు. క్రొత్త స్త్రీ నెవతెనో మోహించినావు. నేను నీకోసము చచ్చిపోతున్నాను. నేను నిన్ను త్రాసులో ఉంచి తూచినాను."

"మారో నాథ నబోలే బోల, అబోలా మరియే రే,
హు క్యము కరీ వేరు వియోగ, హావే శు కరియే రే.

"నా నాథుడు నాతో మాట్లాడడు. అతని మాటలు వినబడకపోతే నేను చచ్చిపోతాను. ఈ విరహమునెట్లో సహిస్తాను. కాని, నేనిప్పుడేమి చేయవలెను?"

నరసింహమెహతా రచించిన యితర గ్రంథములు రాసనహస్రపది, వసంతానోపదో, హిందోలానాపదో, కృష్ణ జన్మ, బాలలీల, నాగదమన, దానలీల, మానలీల, సుదామా చరిత్ర, గోవిందగమన, మొదలయినవికలవు. ఇవి అన్నీ శ్రీకృష్ణునిలీలలకు సంబంధించినవి. భాగవతపురాణము నుంచి తీసుకోబడినవి. 'శామలా శానో వివాహ' అనేది నరసింహుని కొడుకయిన శామలుని వివాహమునకు సంబంధించినదై కవి స్వీయ చరిత్రమును తెలుపుతున్నది.

'సురతసంగ్రామ' మనే గ్రంథము మిక్కిలి మనోహరమైన ఆఖ్యానము. ఉత్తమ కావ్యము. కవి స్వకపోల కల్పితము. కథలో కవి కూడా ఒక పాత్రము కావడముచేత మరీ చిత్తాకర్షకము.

వసంతసమయము. ఉదయకాలము. పక్షులు శ్రుతి సుభగముగా కిలకిలారావములు చేస్తున్నవి. అప్పుడు రాధ పదిమంది చెలికత్తెలతో పెరుగు అమ్మడానికి బయలుదేరుతున్నది. త్రోవలో కృష్ణుడు పదిమంది చెలికాండ్రతో పెరుగు కోసము వారి నడ్డగిస్తాడు. కృష్ణుడు రాధను తిట్టుతాడు. స్త్రీరూపము తాల్చిన రుద్రునివలె ఆమె కృష్ణుని పట్టుకొంటుంది. కృష్ణు డామె నెదిరిస్తాడు. యుద్ధ మారంభమవుతుంది.

ఇంతలో కృష్ణుని తండ్రి నందుడు వస్తాడు. స్త్రీపురుష వీరులు నందుడు పోయినదాకా దాగుకొంటారు. నందుడు దూరముగా పోగానే మళ్ళీ కలుసుకొని పున్నమనాటి పండువెన్నెలలో యుద్ధము సాగింతుదామని 'ఓడినవారు గెలిచినవారికి దాసులు కావలెనని ఏర్పాటు చేసుకొని పోతారు. ఘోరముగా పోర వలెనని రాధ నిశ్చయించుకొన్నది. పున్నమరాత్రి వచ్చినది. రాధ చెలికత్తెలతో యుద్ధమునకు బయలుదేరినది. ఎవతె ఎవనితో పోరాడవలెనో ఎంచుకొన్నారు. 'మాకు లొంగి పోవలసినది' అని రాధ కృష్ణునికి లేఖ వ్రాసి నరసింహా మెహతా కిచ్చి పంపుతుంది. ఈలోగా కృష్ణుని పక్షమువారు తమలో తా 'మాసుందరులకు లొంగవలెనా, కూడదా, అని ఆలో చించుకొంటారు. ఒకడు, "నీవు జయిస్తే ఆమెకు విచారము కలుగుతుంది, అందుచేత నీకు సంతోషము లేదుకదా. ఇక ఆమెయే గెలుస్తే నీ కవమాన దుఃఖము తప్పదు. అందుచేత యుద్ధము లేకుండగనే బుద్ధిగా లొంగిపోవడము మంచిది" అని ఉపదేశిస్తాడు. 'కృష్ణు డొప్పుకొనడు' 'ఆడువారికి లోబడు తానా?' అంటాడు. ఇంతలోగా నరసింహా మెహతా రాధ లేఖను తీసుకొని వస్తాడు. కృష్ణుని పక్షమువా రతడు దొంగ అని పట్టుకొని తన్నుతారు. కృష్ణు డడ్డుపడి అతనిని విడిపిస్తాడు. నరసింహుడు దూతకార్యమును సగర్వముగా నిర్వర్తించి, తానొక గోపిక అయినట్లుగా భావించుకొని, 'గోపసుందరులకు లొంగిపోవలసినదని ఉపదేశిస్తాడు. "స్త్రీలను జయించు టేమైనా సామాన్య మనుకొన్నారా? నరసింహమునకంటె ఆడుసింహమునకు బల మెక్కువ. అట్లే గోపికలు కూడా

మీకంటె బలముకలవారు. జాగ్రత్త!" అంటారు. గోపబాలు రతని ఉపదేశములు నిరాకరిస్తారు. అందరున్ను కలిసి గోపికల వంకకు నడుస్తూ, ముందుగా తమకు లొంగిపోవలసినదని గీత గోవింద కర్త అయిన జయదేవుని దూతగా పంపుతారు. రాధ తిరస్కారముతో, "మే మెవర మనుకొన్నావు? మేము స్త్రీలము; ఆదిశక్తులము. సుర, దానవ, మానవులకు జనయిత్రులము. క్షేత్రములేని బీజము నెప్పుడైనా చూచినారా?" అని జయదేవుని పంపివేస్తుంది. ఎవ రెవరికి లొంగిపోవలెనో తెగకపోవడము చేత రెండు సైన్యములవారున్ను ఒకరిమీద కొకరుపోతారు. ఒకరిమీద ఒకరు ముద్దులు, కౌగిలింతలు, భ్రూచాపములొంచివదలిన కటాక్ష వీక్షణ తీక్షణబాణములు, ప్రయోగించుకొంటారు నరసింహమెహతాకూడా ఈపోరాటములో పాల్గొంటాడు. మొదట గోపకులోడిపోతారు. కృష్ణుడు వారిసహాయమునకు వస్తాడు. రాధ మొదట పరాజిత అయి, వెంటనే తేరుకొంటుంది. తన చెలికత్తెలు చేరుకొని దీనవిలోచన బాణమును ప్రయోగిస్తుంది. దానితో గోపకులు చెల్లాచెదరౌతారు. కృష్ణుడు మూర్ఛపోతాడు. అతని చెలికాండ్రతనిని యుద్ధరంగమునుంచి మోసుకొనిపోతారు. గోపికలు వారిని వ్రజనగరము పొలిమేరవరకున్ను తరుముతారు. గోపికానాథునిజయించి రాధా సుందరి తాను జయించిన దేశము నాక్రమించుకొంటుంది.

నరసింహమెహతా రచించిన కొన్ని పదములలో కవిత్వము పరాకాష్ఠను పొందుతుంది. అట్టిది ఒకటి:

"నీరఖనే గగనమాం కోంణ ఘుమిాం రహ్యో, తేజ హు తేజ హు
శబ్దోంతే;
శ్యామనా చరణమాం ఇచ్ఛు ఛు మరణరే, అహిాయా కోఇ
నథీ కృష్ణ తోంతే,
శ్యామ శోభా ఘణీ బుద్ధి నాశకే కల్లీ, అనంత ఓచ్ఛవమాం
పతథ భూలీ;
జడనే చైతన రస కరీ జాంణవో, పకడి ప్రేమే సజీవన మూళీ;

జళహళ జ్యోత ఉద్యోత రవి కోటమాం, హేమనీ కోర జ్యా
నీసరే తోంతే,
సచ్చిదానంద ఆనంద క్రీడా కరే, సోననా పారణా మాంహ
ఝూంతే,
వత్తీ విణ నీరఖవో, రూప విణ పరఖవో, వణ జిహ్వాఏ రస
సరస పీవో,
అకళ అవినాశ ఏ నవజ జాయే కళ్యో, అరధ్ఉర్ధనీ మాంహే
మహాతే,
నరస్మై యాం చో స్వామి సకళవ్యాపీ రహ్యో, ప్రేమనా
తంతిమాం సంత ఝూంతే.

"ఆకాశము వంక చూడు. దానిలో వ్యాపించి ఎవడో "సోహమ్, సోహమ్ అని అంటున్నాడు, వాడెవడో గుర్తించు. శ్యామలుని పాదములవద్ద చచ్చిపోతాను. కృష్ణునితో సమానుడికకూడ మరెవ్వడున్నులేడు. నామనస్సు అనంతమయిన ఆనందములో కలిసిపోయి ఆ ఘనశ్యామశోభలో తను కనుగొనజాలకున్నది. జడము, చేతనము కూడా

ఒక్కటే అని తెలుసుకో. ప్రేమతో శాశ్వత జీవనమునకు గట్టిగా అంటిపెట్టుకో. కోటిసంఖ్యాకమైన ఉద్యత్సూర్యుల నుంచి అనంతజ్యోతి బయలువెడలుతున్నది. చూచినావా అక్కడ? అచట ఆకాశము జ్వలత్కనకాంబరముతో కప్పబడి ఉన్నది. అచట సచ్చిదానందమూర్తి హేమడోలికలో ఊగుతూ క్రీడిస్తున్నాడు. అచ్చట వత్తిలేదు, నూనెలేదు, దారములేదు, అయినా శాశ్వత నిశ్చలకాంతితో జ్యోతి వెలుగుతున్నది. ఆరూపరహితుని చూదాము; కాని, ఈచర్మ చక్షువులతో కాదు. ఆ ఆనందరసము నాస్వాదింతాము, కాని, ఈమాంసకృత్తయిన జిహ్వతో కాదు. అతడు బుద్ధీంద్రియమున కతీతుడు, అవినాశి. క్రిందికిని మీదికిని ఊగుతూఉన్న అజరామరుడు. నరసయ్య స్వామి సర్వవ్యాపి. సత్పురుషులు మాత్ర మాతనిని తమ ప్రేమపాశములతో బంధించగలరు."

గాంధీమహాత్మునికి ప్రాణప్రియమైన నరసింహ మెహతా రచితమయిన ఈ క్రింది పదము నుదాహరించనిదే ఈ మహాకవి ప్రశంసను ముగించడము యుక్తము కాదు.

" వైష్ణవజన తో తేనే కహీఏ, జే పీడ పరాఈ జాణే రే;
పరదుఃఖే ఉపకార కరే తే, మన అభిమాన న ఆణే రే.
సకళలోకమా సహునే వందే, నిందా తే. న కరే కేనీ రే;
వాచకాఛమన నిశ్చల రాఖే తో, ధన్య ధన్య జననీ తేనీ రే.
సమదృష్టినే తృష్ణా త్యాగీ, పరస్త్రీ జేనే మాత రే;
జీహ్వా థకీ అసత్య న బోలే, పరధన నవ ఝాలే హాథ రే.

మోహమాయా వ్యాపే నహి తేనే, దృఢవైరాగ్య జేనా
మనమాం రే;
రామనామసు తాళీ రే లాగీ, సకళ తీరథ తేనా తనమాం రే.
వణలోభీనే కపటరహిత ఛే, కామక్రోధ నివార్యా రే;
భణే నరసైయో తేను దరసన కరతాం, కుళ ఇకోతేర
తార్యా రే.

“ఇతరుల బాధలు తనవిగా ఎవడు తలంచుకొంటాడో వాడే నిజమైన వైష్ణవుడు. అతడు దుఃఖితులైనవారికి సహాయపడుతాడు. అతడు గర్వమును పొందడు. అతడందరియెడలను నమ్రుడై ఉంటాడు, ఎవ్వరిని నిందింపడు, మనోవాక్కర్మములలో నిశ్చలుడై ఉంటాడు. అట్టివాని జననియే ధన్యురాలు. అతడు సమదృష్టిని కలిగి ఉంటాడు, తృష్ణను త్యజిస్తాడు. ఇతరుని భార్యను తల్లినివలె చూస్తాడు. అతడెన్నడున్ను అసత్యము పలుకడు, ఇతరుల ధనము నంటడు. అతడు మోహమాయకు వశుడు కాడు. అతని మనస్సు దృఢవైరాగ్యనిష్ఠితమై ఉంటుంది. రామనామజపముతో అతని మనస్సానందమును పొందుతూ ఉంటుంది. అతని శరీరములోనే సమస్త తీర్థములును ఉంటవి. అతడు లోభి కాడు, కపటి కాడు. అతడు కామక్రోధముల కతీతుడవుతాడు. అట్టివాని సందర్శనమువల్ల వంశము డెబ్బెఒక్క తరములవరకున్ను పుణ్యవంతమై తరిస్తుంది.”

ఇట్టి కీర్తనల మూలముగా నేటికిన్ని గాంధీమహాత్మునివంటి అప్రతిమాన కర్మవీరులును, దానవీరులును, త్యాగధనులును

విజ్ఞానధనులును భరతవర్షములో ఉత్పత్తి కావడానికి తోడ్ప డిన వాఙ్మయమును రచించిన నరసింహ మెహతా వంటి భక్తాగ్రేసరు లుద్భవించిన గుజరాతు ధన్యము కాదా ?

---

# పంచమాధ్యాయము

## ప్రేమానందుడు, దయారాముడు

---

నరసింహ మెహతా పదములు గుజరాతదేశము నుఱ్ఱూత లూగించినవి. అతనిని గూర్చిన అనేక అద్భుతగాథలు బయలు చేరినవి. ఆ గాథల నన్నిటిని ఆఖ్యానములుగా కవులు రచిస్తూ వచ్చినారు. పౌరాణిక పద్ధతి, గీత పద్ధతి రెండునూ సమ్మేళ నము పొంది క్రొత్తరీతి వాఙ్మయ మేర్పడజొచ్చినది. 1645 ప్రాంతమున ఒక కవి 'హారమాల' అనే గ్రంథమును రచించి నాడు. దీనిలో నరసింహ మెహతా మాహాత్మ్యమును రామాండలికు డనే రాజు విని అతనిని రప్పించి తెల్లవారే సరికి కృష్ణుని చేతినుండి ఒక పూలమాలను తీసికొని రావల సినదని కోరినాడనిన్నీ, రాత్రి అంతా నరశింహ మెహతా కృష్ణాలయములో గానము చేయగా తెల్లవారేసరికి కృష్ణు డాతనికి పుష్పహారము నిచ్చినాడనిన్నీ, దానిని తీసికొనిపోయి రాజునకివ్వగా అతడు నరశింహ మెహతాకు శిష్యుడై రాజ్యపరిత్యాగము చేసినాడనిన్నీ వ్రాయబడి యున్నది.

విశ్వనాథజాని(1625-1675) మోశాల చరిత్రమును వ్రాసినాడు. దీనిలో నరశింహుని కూతురు వివాహమునకు కావలసిన ధనమును శ్రీకృష్ణుడే తెచ్చి యిచ్చిన విషయము వర్ణింపబడినది. 1655లో కృష్ణదాసకవి హరిచరిత్రమునూ, 1657లో హుండీ చరిత్రమునూ వ్రాసినాడు. ఒకనాడు నరశింహుని యింటికి చాలమంది అతిథులు వచ్చినారట. అతని యింటిలో అప్పటికి సోలెడు గింజలైనా లేవట. ఊరిలో వారందరున్నూ నరశింహుండేమి చేస్తాడో చూదామని నవ్వుతూ కూర్చున్నారట. అప్పుడు కృష్ణుడు స్వయముగా హుండీ వ్రాసి కావలసిన భోజనపదార్థముల నన్నిటిని తెప్పించి, నరశింహుని యింటిలో యిచ్చినాడట. ఇదియే హుండీ కావ్యములోని విషయము.

ఆనాటి కవు లందరిలో ప్రేమానందు డగ్రగణ్యుడు. ఇతడు బరోడా పట్టణవాసి. బ్రాహ్మణుడు. ఇతడు చిన్నతనములోనే మాతాపితృ విహీనుడైనాడు. అతడు శుద్ధ మొద్దు అని అందరున్నూ అనుకొనేవారు. కాని అతడు రామచరణు డనే సన్యాసితో ఉత్తరహిందూస్థాన మంతా తిరిగి సంస్కృతమునూ, హిందీని నేర్చుకున్నాడు. ఆ కాలములో హిందీభాష కెక్కువ గౌరవ ముండేది. అతడు హిందీలో కావ్యములను వ్రాయ నారంభించినాడు. కాని అతని గురువు "నీ యింటికి గుమ్మమును వదలి దూరపు కొండను ఎక్కనెంచుతా నేమి" అని మందలించగా అతడు తన మాతృభాషయైన గుజరాతీలోనే కావ్యరచన నారంభించినాడు.

ప్రేమానందుడు సూరతులో గాగరియా భట్టుగా జీవనము నారంభించినాడు. ఆ కాలములో మొగలాయీ సామ్రాజ్యమున సూరతు గొప్ప రేవుపట్టణముగా ఉండేది. ప్రేమానందుని పురాణపఠనము జనామోదమును పొందినది. బరోడా, నందురబార, ఖాన్ దేశము మొదలైన దేశములనుంచి అతని కాహ్వానములు వస్తూ ఉండేవి. అతడు పురాణము చెప్పి దండిగా ధనము సంపాదించి బ్రాహ్మణులకు సంతర్పణములు చేయుస్తూ ఉండేవాడు. ఆ సంతర్పణములలో పారిన ఘృత ప్రవాహములకు కృష్ణుడే చక్కెర గట్లను కట్టుతూ ఉండేవాడట. అతనికి 52 శిష్యు లుండేవారు. వీరిలో పన్రెండుగురు స్త్రీలు. వీరందరున్నూ కావ్యరచనమును చేయ నేర్చినవారే. ప్రేమానందుడు పరమపదించే సమయములో తన కొడుకైన వల్లభుడు హిందీకావ్య ఫక్కీనీ, రత్నేశ్వరుడు మరాఠీకావ్య రీతినీ, వీర్ జీ ఫారసీకవుల మార్గమునూ, సుందరుడు పురాణముల శ్రోవనూ అవలంబించవలెనని ఉపదేశించినాడట.

ప్రేమానందుడు 57 గ్రంథములను వ్రాసినాడని వినికి. వీటిలో అనేకములు పెద్దగ్రంథములు. ఇతడు రచించిన గ్రంథములలో చంద్రహాసాఖ్యానము, ఋష్యశృంగాఖ్యానము, ద్రౌపదీ స్వయంవరము, మాంధాతాఖ్యానము, భగవద్గీత, నలఖ్యానము, ద్రౌపదీ హరణము, సుభద్రా హరణము, అష్టావక్రాఖ్యానము అనేవి మహాభారత కథలు. లక్షణా హరణము, ఓఖాహరణము, సుదామాచరిత్రము, వామన చరిత్రము, దానలీల, సప్తమస్కంధము, రుక్మిణీహరణము,

ధ్రువాఖ్యానము అనేవి భాగవత పురాణాంతర్గతములు. మదాలసాఖ్యానము, హరిశ్చంద్రాఖ్యానము, దేవీ చరిత్రము, మార్కండేయ పురాణము లోనివి. రణయజ్ఞము రామాయణ కథ. ఇవికాక మహాభారతము, భాగవతము, మార్కండేయ పురాణము, రామాయణములను కూడా ఇతడు సంపూర్ణముగా రచించినాడు. నరశింహ మెహతా జీవిత గాథలను ప్రకటిస్తూ హుండీ, హారమాల, శ్రాద్ధ, మామేరు అనే గ్రంథములను వ్రాసినాడు. ఇవికాక స్వర్గనీసరణీ, వివేక వణజారో, భ్రమరపచ్చీసి. అనే కావ్యములను కూడా ఇతడు వ్రాసినాడు.

ఇతడు తన కావ్యములలో ఇతర కవులనుండి గ్రంథ చౌర్య మెక్కువగా చేసినాడని చెప్పుతారు. పౌరాణికుడు కాబట్టి ఇతని భాషలోనూ, రచనారీతులలోనూ అనేక భేదములు కనిపించడము వింత కాదు.

ప్రేమానందునికి గుజరాతీభాష అంటే గర్వము. దానిని సంస్కృతమువంటి గొప్ప భాషగా చేయనిదే తలపై పాగా చుట్టనని అతడు శపథము చేసినాడట. అతడు రచించిన 'రోష దర్శికా సత్యభామాఖ్యానము' అనే నాటకములో

సాంగోపాంగ సురంగ వ్యంగ అతిశే,థారో గిరా గుర్జరీ,
పాదే పాద రసాళ భూషణవతీ, థాఓ సఖీ ఉపరీ;
జే గీర్వాణ గిరా గణాయ గణ తా,పే స్థాన ఏ ల్యో వరీ,
థాఏ శ్రేష్ఠ స హు సఖీజనథకీ, ఏ ఆశ పూరో హరి.

"గుజరాతీభాష సాంగోపాంగ సుందరముగా వ్యంగార్థ బహుళముగా ఉండును గాక. దానియొక్క పాద పాదమునూ రసాలమాధురి కలిగి సమస్త భాషాసఖులకునూ పైచేయిగా ఉండును గాక. గీర్వాణభాష ఆక్రమించిన స్థానమును ఇది కూడా ఆక్రమించును గాక. తన సఖులలో గుజరాతీవాణి శ్రేష్ఠురాలుగా గణింపబడేటట్లు హరి అనుగ్రహించును గాక" ఇట్టి భాషాభిమానము తెలుగువారి కెప్పుడు కలుగుతుందో!

ఇతని గ్రంథములనుండి కొన్ని ఉదాహరణములు:—

మారూ మాణకడు రీసావ్యూరే, సామలీయూ, తారా
మనమా ఏ శు ఆవ్యూరే, సామలీయా;
హు అపరాధణ మాతానే మూకీ, శా మాటే రుంసావ్యూరే,
సామలీయా ॥మారూ॥

కాలిందీను కాళు పాణీ, మ్హాహే వసే కాళో కాళీ,
హావే ఆశా తే శీ ముళవాళీ, కేమ ఆవే వనమాళీరే,
సామళీయా ॥మారూ॥

సంతాన రూపీయు మోటు ధన తే, కరమే లీధుం లూటీ,
మే నవ జాణ్యు జతన కరీనే, రతన పడయు, కేమ ఛూటీరే,
సామళీయా ॥మారూ॥

పుత్ర పామీ హు ఛేలే ఆశ్రమే, అఛేయో ప్రతిపాళీ,
సీపనో రసధళీ గయో హు, బీజో గ ఆగే బాళీరే,
సామళీయా ॥మారూ॥

నాకే మోతీ పాట ఘూఘరీ, మోర ముగట శిర ధారీ,

ఘరీ రూప హు క్యాక్షే దేఖూ; హరి ఆవే గొ చాకిరే

సామళ్లీయా ॥మారూ॥

కానే కుండల ముఖమా మోరలీ, సంజే గోకుల ఆవ్యో,

భాఖ్యో భా కహీ పేట దేఖాడ్యో, మా కహీ నానే ఖోలాడేరే,

సామళ్లీయా ॥మారూ॥

పీత పఛోడీ కాఛ కచ్ఛే, ముజ కనే నేతరూ మాగే,

హు ఘుకడీ మానే థాకీ జాణే; కోణ బలోవవా లాగే రే,

సామళ్లీయా ॥మారూ॥

తు ప్రాణేశ్వర తుం గోపేశ్వర, గోపీ దేహ కేమ ధరశే,

బాళ సఖాసీ కోణ వళే ఆ, గాయో హీసీ హీసీ మరశే రే.

సామళ్లీయా ॥మారూ॥

ఉండా జళమా వాసో కీధో, పాణీమా కేమ గమశే,

మోర పోపట పూతళీ తారే, రమకడే కోణ రమశే రే,

సామళ్లీయా ॥మారూ॥

కాళి తు గయో మే హు జీవు ఛు, ఓభా సగపణ మాళే,

సాచుం వహాల శోత్యా జణాప, సాంభళతా హైయు ఫాటే రే,

సామళ్లీయా ॥మారూ॥

తే మఖాంతర దఘాను కధు, మనమా దుఃఖ కాళి ఆవ్యు,

ఉఖలను బంధన ఆజ సాంభరియు, తే మాటే ఝుంపావ్యు రే,

సామళ్లీయా ॥మారూ॥

నంద యసోదా గాయ గోవాడా, వ్యాకుళ వ్రజణీ నారీ,

చార ఘడీ పూశే సర్వ ప ధజో, హాళధర రాఖే వారీ రే,

సామళ్లీయా ॥మారూ॥

"శ్యామలా! నీ తల్లిని వెనుక విడిచి నదిలోని కెంపునకు దుమికినావు. యమునాతోయములు నల్లగా నున్నవి. దానిలో నల్లని కాళీయు డున్నాడు. నిన్ను నే నెట్లు కలుసుకొందునురా. నీవు నాకు తిరిగీ ఎట్లు వత్తువురా. నా బిడ్డడు నా ప్రాణము, విధి వాని నపహరించినాడు. నా భూషణమును రక్షించుకొన లేకపోయినాను. అది నాకిప్పుడు పోయినది. లేక లేక బిడ్డడు పుట్టినాడు వానిని పెంచినాను పెద్దచేసినాను. నేను కూడపెట్టు కొనిన మాధుర్యమంతా పోయినది. పుత్రహీననై నే నగ్ని మధ్యమున ఉన్నాను. ముక్కులో ముత్యము, కాళ్లను గజ్జెలు, తలపై మయూరపింఛముతో, గోవుతో కూడి ఇంటికి వచ్చే నిన్నెన్నడు చూడగందునురా! లోతునీళ్ళలోనికి దుమికినావు. నీ వెట్లు బ్రతుకగలవు. నీ నెమలితోనూ, నీ చిలుకతోనూ నీ ఆటబొమ్మలతోనూ, ఇప్పు డెవ రాడుకొందురు గా. నీవు పోయినావు. నేను బ్రతికి ఉన్నాను. మన ప్రేమ క్షణభంగుర మాయెనే. నేను ప్రపంచము మొగ మెట్లుచూడగలను. ఔను, బంతి అనే మిష పెట్టుకొన్నావు. నిజముగా నీకు నామీద కోపము వచ్చి ఉంటుంది. నీ చిన్ననాట నిన్ను రోటికి కట్టినాను. అది జ్ఞాపకముంచుకొనియూ నదిలోనికి దుమికినావు.

మామేరూ అనే కావ్యమునుంచి ఒక్క ఉదాహరణము. నరశింహ మెహతా కూతురు కున్వారీబాయిని అత్తవారింటికి పంపినప్పుడు కృష్ణు డతనికి సహాయపడిన విషయము. కూతురు అత్తవారింటికి పోతున్నది. ఆ ప్రయాణమును కవి వర్ణిస్తున్నాడు. బండి కట్టించడానికి నరశింహమెహతాకు డబ్బు లేదు. తానే ఒక బండిని తయారు చేస్తున్నాడు.

జమీా వేల మే ధూసరి వాంకీ, సాంగీ ఘోటా భాగే జీ,
కోనా తళాయాం నే కోసి పింజణిచే, బళద ఆరాధ్యే వేమాగీజీ,
మహేశోజీ మామే రే బాల్యా, సమర్యా శ్రీ జగదీశ జీ,
త్రేణ-సఖియో సంఘాతే చాలీ, వేరాగీ దశ వీశ జీ.
సంపుట త్రాంబానీ డాబలీకో, తే మా బాళముకుంద జీ,
కంఠే హార కరీనే రాధ్యా, దామోదర నందన నంద జీ.
బలనీ పూఠే కోథళో బాంధ్యో, మాహే భరియా వాజిత్ర జీ,
గాంఠడీ ఏక గోపీచందననీ, తుళసీ కాష్ఠ పవిత్ర జీ.
మోసాళానీ సామగ్రీమా, తిలక నే తుళసీమాళ జీ
నరసయ్యా నే నిర్భయ ఛే జే, భోగ వశే గోపాళ జీ
బళ హీణ బళతో శు హీండె, తేలే వైష్ణవ సాథ జీ,
ఘోర పాడే నే థాళ చఢావే, జేజే వైకుంఠనాథ జీ.
ఏక బళద గళియో థఈ బేసే, ఆఖలో వాణీజాయ జీ,
పత్యాణే పూఛ గ్రహీ ఉఠాడే కౌతుక కోటీ థాయ జీ.
సాలే సాల జూజవా బీసే, రథ తణా వహుల వక్ర జీ.
సాంగీనో వహు శబ్ద ఉఠే, చూచవే ఛే బహుచక్ర జీ.
చడే బేసీ నే వళి ఉతరే, లే రామకృష్ణనునామ జీ,
మధ్యాహ్న మహేతాజీ ఆవ్యా; జోవా మళ్యు ఉనా గామజీ.

"బండిగూడు ప్రాతది. కాడి వంకర. చక్రము పగిలినది. కొయ్యలు మఱియొక బండివి. ఎద్దులు మఱి ఒకనివి. వాద్యోపకరణములు ఒక సంచిలోనూ, గోపీచందనము ఒక సంచిలోనూ, తులసీ కాష్ఠములు ఒక సంచిలోనూ బండికి వెనుక కట్టబడినవి. బక్క-ఎద్దులు నడువవు. వైష్ణవులు వాటిని

ముందుకు త్రోయవలెను. కొండ ఎక్కుతున్నప్పుడు జయా, జయా అని అంటూ వారు వాటిని త్రోస్తున్నారు. ఒకొక్కప్పుడు మిక్కిలి అలసిపోయి ఒక ఎద్దు బాటమీద పడుకొంటుంది. రెండో ఎద్దే బండిని లాగుతూ ఉంటుంది. అప్పుడు వారు పడుకొన్న ఎద్దు తోకను నులిమి లేవదీస్తారు. ఈరీతిగా వేలకొద్ది సలభపెస్తున్నాయి.. బండి సందుసందులా సడలిపోయి నది. ఇరుసు కిర్రు కిర్రు మంటున్నది. చక్రములు కర్ కర్ మంటున్నవి. రామా, కృష్ణా, అని కేకలు వేస్తూ వారు బండిలోని కెక్కుతారు, బండిలోనుంచి దిగుతారు. ఈవిధముగా మిట్టమధ్యాహ్నమునకు మెహతాజీ ఊణ గ్రామమును చేరుకొన్నాడు. గ్రామస్థులందరున్నూ అతనిని ఆహ్వానించడానికి ఎదురు వచ్చినారు.

ప్రేమానందుని కొడుకులైన వల్లభుడు, జీవనరామ్, ఇద్దరున్నూ కవులు. వల్లభుడు దుశ్శాసన రుధిరపానాఖ్యానము, శుక్రప్రశ్నోత్తరము, కుంతీప్రసన్నాఖ్యానము, కృష్ణవిష్టి, ప్రేమానందకథ, యుధిష్ఠిర వృకోదరాఖ్యానము అనే మహాభారతమునకు సంబంధించిన కావ్యములనూ, మిత్రధర్మాఖ్యానము అనే సాంఘికకథనూ వ్రాసినాడు. ప్రేమానందుని శిష్యులలో రత్నేశ్వరుడు (1700) శిశుపాలవధ, భాగవతము, మూర్ఖలక్షణావలి, వైరాగ్యలత, మొదలైన పదములనూ, లంకాకాండమూ, రాధాకృష్ణనా మహిమ, అనే కావ్యములనూ వ్రాసినాడు. ప్రేమానందుడు వృద్ధుడై యున్నకాలములో శ్యామలభట్టు అనే ఒక యువకవి బయలుదేరినాడు.

ఇతనికి ప్రేమానందుని కావ్యములు సరిపడలేదు. వల్లభునికిన్నీ, యితనికిన్నీ కావ్యరీతి విషయమున ఎడతెగని వైర ముండేది. ఇతడు సంస్కృత, వ్రజ, పారసీ భాషలలో విద్వాంసుడై శివ పురాణము, రేవాఖండము, అంగద విష్టి, రావణ మండోదరీ సంవాదము, కాశీ మాహాత్మ్యము, శుకదేవాఖ్యానము, ద్రౌపదీ వస్త్రాపహరణము, అనే పౌరాణిక గ్రంథములనూ, బత్రీశపుత్లీ (ద్వాత్రింశత్కథలు), సుడాబోహ్తేరీ, పద్మావతీ నందబత్రీశీ, వినేచటనీవార్త, బరాస కస్తూరినీవార్త, చంద్ర చంద్రావతీ, మదనమోహాన, విధాతాశీవార్త, సుందరకము తార, భోజకథ, అనే కథావాఙ్మయమునూ రచించినాడు. రణచోదనాశ్లోక, ఉద్యమకర్మసంవాద, శ్యామల రత్నమాల, అభ్రామ కులీనశ్లోక, (రుస్తమ్ బహాదుర్‌నో పవాడో), బోధాణో, రభీదాసచరిత్ర, విశ్వేశ్వరాఖ్యాన, రణ స్తంభ, అనే గ్రంథములను కూడా శ్యామలభట్టు వ్రాసినాడని అంటారు.

ఇతని కథావాఙ్మయము గుజరాతీభాషలో చాలా ప్రసిద్ధికి వచ్చినది.

1700 సం॥రమునుంచి 1852 సం॥రమువరకు దేశ మల్ల కల్లోలముగా ఉండేది. మొగలాయీ సామ్రాజ్యము క్షీణించి నది. మహారాష్ట్రుల అలజడి ఎక్కువ అయినది. దేశము చిన్నచిన్న భాగములుగా విడిపోయి చిల్లరనవాబుల పాలనకు లోబడినది. ఉరుదూ, పారసీ భాషలకు ప్రోత్సాహ మెక్కువ అయినది. జనులలో నిరుత్సాహము హెచ్చినది. దానితో

అద్వైత వేదాంతము హెచ్చయినది. ఇట్టి యుగములో జ్యోతి వలె గుజరాతులో పుట్టినాడు దయారామకవి.

దయారాముడు సఠోదరానాగర బ్రాహ్మణుడు. ఇతడు 1767 సం॥రములో జన్మించినాడు. ఇతని తలిదండ్రులు చిన్ననాటనే చనిపోయినారు. అతనిని మేనత్త పెంచినది. దయారాముడు చిన్నతనమునుంచిన్ని పెంకెతనములో ఆరితేరినాడు. ఊరి ఆడుపడుచులతో హాస్యములాడుతూ ఉండేవాడు. వారు నీళ్ళు తెచ్చుకొంటూ ఉంటే కుండలు పగులగొట్టేవాడు. ఊరివారతనిని వెంటబెట్టినారు. అతడు పారిపోయి కేశవానందుడనే ఒక సన్యాసికి శిష్యుడయినాడు. భారతవర్షమంతా సంచారము చేస్తూ గోకులము, మధుర, బృందావనము, కాశి మొదలయిన 'పుణ్యక్షేత్రములను సేవిస్తూ, కాశీనుంచి తన భుజములమీద గంగను మోసుకొనిపోయి రామేశ్వరమువద్ద సముద్రములో కలిపినాడు. ఎక్కడకు పోయినా పండితులు, విద్వాంసులు, సాధువులతో కూడి హిందీ, వ్రజ, సంస్కృత భాషలను బాగుగా నేర్చుకొన్నాడు. ప్రాచీన గుజరాతీ కావ్యములను బాగుగా అభ్యసించినాడు. వైష్ణవమతమును స్వీకరించి తొలుత తనకుండిన దయాశంకరుడనే పేరు వదలి దయారాముడని పేరు పెట్టుకొన్నాడు.

దయారాముడు శృంగారపురుషుడు. అసలే అందగాడు, దానికితోడు శరీరమును శృంగారించుకొనడములో చాలా శ్రద్ధ తీసుకొనేవాడు. తనవద్ద డబ్బు లేకపోయినా వాసననూనెలను, అత్తరు పన్నీరులను ఎట్లో స్నేహితులనుంచి

సంపాదించేవాడు. జుట్టు పెద్దదిగా పెంచుకొని పరిమళ తైలము లను రాచి ఎంతో అందము చేసుకొనేవాడు. అతని పెదవు లెల్లప్పుడును తాంబూలారుణరాగ శోభితమై ఉండవలెను. ఒకప్పుడు కొంచెము 'భంగీ'ని కూడా సేవించేవాడు. జలతారు చెమికీపని చేసిన పలుచని డక్కా మల్లిని అంగీని లోపలి అవ యవసౌష్టవము ప్రస్ఫుటమయ్యేటట్లు తొడిగేవాడు. అతని ధోవతి నాగపురమునుంచి రావలెను. దానికి ఎర్రని పట్టంచు ఉండవలెను. నవద్వీపములో నేసిన, ఎర్రనిరంగు అద్దిన రుమా లును బాగుగా మడతలుపెట్టి తలకు చుట్టుకొననిదే ఇంటినుండి బయటికి వచ్చేవాడుకాడు.

అతడు చిన్ననాటినుంచిన్నీ సంగీతము నభ్యసించి మనోమోహనముగా పాడుతూ ఉండేవాడు. అతని కంఠములో కిన్నెరలు మ్రోగుతూ ఉండేవి. అతని మాటల మాధుర్యము నకే అందరున్ను మెచ్చుకొని అతనితో సంభాషించడమే తమకు గౌరవ మనుకొనేవారు. మతవిషయములేకాదు, ఏవిష యము చర్చకు వచ్చినాసరే అందరిని అవలీలగా తన పరము చేసుకొనేవాడు. అతని కొకరి లక్ష్యము లేదు. సంఘమర్యాద లకు లక్ష్యము లేదు. అతని కాత్మాభిమాన మమితము తన కెవరైనా ఎదురు వస్తే పట్టరాని కోపము. శ్రీకృష్ణునికి తప్ప మరి ఒకరిముందు తలను వంచనని అతని శపథము. బరోడా వాసీ, ధనికుడు అయిన గోపాలదాసు గణపతిమీద కవిత్వము చెప్పుమంటే "నాకు గోపీవల్లభుడే ప్రభువు. మరి ఒక ప్రభువు లేడు. నీవు సంతోషించినా, కోపించినా నాకు జోక్యము లేదు" అని ప్రత్యుత్తర మిచ్చి పంపించినాడు. ఒకనాడు తన గురువు

తన్ను గురించి కొంచెము నిందాగర్భితముగా మాట్లాడితే అతని యెదురుగానే శిష్యచిహ్నమయిన తులసీమాలను త్రెంచివైచి, అతని మొగముమీదికి విసరి తనదారి తాను పట్టినాడు.

దయారాముని శృంగారకవిత్వమునకున్ను నరసింహ మెహతా కవిత్వమునకున్ను చాలా భేదమున్నది. నరసింహుడు భక్తాగ్రేసరుడు, తాను గోపిక ననుకొని కృష్ణుని సాక్షాత్కరించుకొని గానము చేసేవాడు. దయారాముడు షోకెల్లా రాయడు. తానే కృష్ణుడు, తక్కిన జీవత్ స్త్రీలందరున్ను గోపికలు. వారు గరబ నృత్యము చేస్తున్నప్పుడు, నదిలో స్నానము చేస్తున్నప్పుడు, వారి దేహసౌందర్యమును చూచి మురిసిపోయి పద్యములు చెప్పుతూ ఉండేవాడు.

అతనికి రతనబాయి అనే ఒక కంసాలి వితంతువు మిండకత్తెగా ఉండేది. ఆమెతో అతడు ముప్పయి యేండ్లు కలిసి ఉన్నాడు. ఆమెకున్ను తనకున్ను పూర్వజన్మ సంబంధ ముండేదనేవాడు. నూరేండ్లయిన తరువాత తానున్ను రతనా బాయియున్ను వచ్చే జన్మములో ఆలుమగలుగా ఉండగలరని ఒక గోసాయిచేత జోస్యము చెప్పించుకొన్నాడు. ఆచారనిష్ఠ గల బ్రాహ్మణకులములో పుట్టినవాడు గనుక తానే వంట చేసేవాడు. ఇద్దరున్ను కలిసే తినేవారు.

దయారాముడు 1852 సం॥రము ఫిబ్రవరి 7 వ తేదీని దేహమును చాలించుకొన్నాడు. అతనిమూలముగా గుజరాతీ వాఙ్మయమునకు గొప్ప శోభ కలిగినది. అతడు వ్రాసిన గ్రంథములలో వల్లభనో పరివార, చోరాశి వైష్ణవను ధోల, భక్తిపోషణ, అనేవి వైష్ణవ సంప్రదాయము ననుసరించినవి.

అజామిలాఖ్యాన, వక్రాసురాఖ్యాన, సత్యభామాఖ్యాన, ఓఖాహరణ, దశమలీలా, రాసపంచాధ్యాయి, అనేవి వల్లభ సంప్రదాయము ననుసరించిన తత్త్వగ్రంథములు. నరసింహ మెహతానీ హుండీ, షడృతువర్ణన, నీతిభక్తినాపదో, అనేవి చిల్లర గ్రంథములు. ఇతడు రచించిన 'గరబీ'లు 'గరబీసంగ్రహ' మనే గ్రంథముగా ప్రకటింపబడినవి.

ఇతడు రచించిన గ్రంథము లన్నింటిలోను భాష అసమాన సౌందర్యశోభితముగా ఉంటుంది. వాటిలో ఇతని గరబీలు జగత్సమ్మోహనములు. వాటిలోని శబ్దార్థములు చంద్రచంద్రికలవలె ప్రకాశిస్తవి; మధుమాధుర్యములవలె చవులు గొలుపుతవి; వీణారావములవలె శ్రుతి సుభగములుగా ఉంటవి. వాటికి మూడుదాహరణములుమాత్ర మీక్రింద ఇవ్వబడినవి.

"వాకు మాఝోశో వరణాగీఆ, జోతా కాళీజామా కా ఈ
థాయ ఛే జీలే;
అణియాళీ ఆఖే వాలమ ప్రాణ మారో ప్రోయో ఛే,
మోహన ముఖడు జోఇ మనడు మోహాయ ఛేజీరే; వాకు ....;
నఖశిఖ లగీ రూప రసిక మధుర మనోహర,
జ్యా జోఇవ త్యా ఆఖ ఠరీ జాయ ఛే జీరే; వాకు...;
మానీతీ తు ఛే మోహనతణీ, హాం వాసలడీ రే!
తుంనే వాలమ కరే ఛే ఘణు వహాలరే, హాం వాసలడీ!
మారో ఆవడో శో సోహోర, మోహ్యా నందనో కిశోర,
తారు ఆవడు శు జోర, భుండి! కాలజడు మాంకోర రే;
హాం వాసలడి!

పీప అధరామృత పీయు తఃఖ తు, హో వాసలడీ రే!
అమారే శోక్య మరీఖు తు నాలరే, హో వాసలడీ!
మీాఠో...;

వాజీ వాజీనే విహ్వాల కర్యా హో వాసలడీ!
తుం తో పీడే అమారా ప్రాణ రే హో వాసలడీ!
ముణతా పడే ఛే హృదే సుసారా హో వాసలడీ!
తాహారం టహుకాంథీ మోహబాణ రే హో వాసలడీ!
మీాఠో...;

ఘేర ఘణు ఛే తారీ ఝపటమా హో వాసలడీ!
భలా తుంథీ భాలాతరవార రే హో వాసలడి!
ఏకీ వారే తు హాంకీ నాఖసీ హో వాసలడీ!
ఓ భుండి ఛోడే ఛోడే మా మార రే, హో వాసలడీ!
మీాఠో...;

పతివ్రతానా పణ ముకావ్యా హో వాసలడీ!
తే తో ఛోడాలీయూ సతీఓనా సత్య రే. హో వాసలడీ!
వనవన కుంజ కుంజ ఫేరవ్యాం తే హో వాసలడీ!
తే తో సహూనీ కరీ ఛే ఏవీ గత్య రే. హో వాసలడీ!
మీాఠో....;

గరజే కుమానభరీ ఆవకే. హో వాసలడీ!
తు తో జాసీ విచారీ తాహారీ జాత రే, హో వాసలడీ!
జోతా తు కాష్ఠ కేరో కరకడో హో వాసలడి!
తునే ఆజ మళీ ఛే టకరాత రే, హో వాసలడీ! మీాఠో...;
గత విహీణా తే ఛేహలా కర్యా, హో వాసలడీ!

తే క్యో లగాయీ లాలసు లగనరే, హాయ్ వాసలక్ష్మీ !
చోరనీ సంగే శీక్షీ చోగవా, హాయ్ వాసలక్ష్మీ !
వహాతే మాఖిణ చోరయు నే తే క్యో మనరే, హాయ్ వాసలక్ష్మీ !

మిూతో...;

మానన రాఖ్యా మానీతమ్, హాయ్ వాసలక్ష్మీ !
తే త్యో సపనే కర్యా పాపమూలరే, హాయ్ వాసలక్ష్మీ !
దయానా ప్రీతమనీ దాసీ తు ఖరీ, హాయ్ వాసలక్ష్మీ !
తేడే సహునే బేశీ తు త్యో రామరే, హాయ్ వాసలక్ష్మీ !

మిూతో...

"ప్రియా, నావంక కళ్లు మూడకు; నీ క్రేగంటి వాల్చూపుల చేత నా హృదయము ఝులుఝల్లు మంటున్నది. నీ వాడి చూపుతూపులు నా హృదయమును చొచ్చుకొని పోతున్నవి. అయినా నిన్ను చూడడమే నా కానందము.

సమస్త శృంగారము, సమస్తానందము నీలో ఇమిడి ఉన్నవి నిన్ను చూస్తే ఆనందపారవశ్యము కలుగుతుంది. నీ ముకుటాన ముత్యమిటునటు సల్లాడుతూ ఉంటే, నాహృదయము కూడా లటుకు లటుకు మంటున్నది.

ఓ పిల్లనగ్రోవీ! నీ పతని పెంపుడుబిడ్డవు, అతని మోహన మూర్తివి. నీ నాద మతని హృదయమును పరవశము చేసినది, కాని నా హృదయమును దూసుకొని పోతున్నది. నీ వతని అధరామృతమంతా (నాకుంచకుండా) త్రాగివేస్తున్నావు. నేను చచ్చిపోతే నీకేమి లోపము ?

నీ నాదము నన్ను పిచ్చి యెత్తిస్తున్నది. నీ నాదశరములు శోకసంతప్తమయిన నా హృదయమునకు దీర్ఘబాధను కలిగిస్తున్నవి,

ఓ పిల్లనగ్రోవీ, విషదిగ్ధములయిన నీనాదబాణాగ్రముల కంటె ఖడ్గములును బల్లెములును కూడ దయావంతములు సుమా! అవి ఒక్క-సారిగా నరికివేస్తవి. నీవో మెల్లమెల్లగా దీర్ఘబాధను పెట్టుతున్నావు.

ఇల్లాండ్రు తమ పాతివ్రత్యమును గాలి కెగజిమ్మినారు. ఋషులు తమ మహిమను మరచి, పాపములో పడినారు. వారికి చిత్తచాంచల్యము కలిగినది. నీ నాదమును వినడానికి వారరణ్యములలో పరిభ్రమిస్తున్నారు.

పట్టరాని గర్వముతో మైమరచి ఉన్నావు. నీ వెవరవో జ్ఞాపకమునకు తెచ్చుకో. నీవొక వెదురుకట్టెవు. అతని స్పర్శ చేత నీవు దివ్యవేణువ వయినావు.

వేలకొలది జనమునకు నీవు పిచ్చి యెత్తించినావు. ఓ పిల్లనగ్రోవీ! నానాథునికి సహచారిణివై, నీవతనికంటె పెద్ద దొంగ వయినావు. అతడు నవనీతచోరుడు మాత్రము; నీవతని హృదయమునే దొంగిలించినావు.

నా గర్వము ధూళి అయిపోయినది. ఆ ధూళిలో వేలకొలది జనులు దీనులై పడి ఉన్నారు. వారి నందరిని నీ నాదమాకర్షించినా, వారతని దాసులకే సుమా ప్రత్యుత్తరమిస్తున్నారు!

మరి ఒక చక్కని గరబి :—

"నందనందన అలవేలడో రే, ఏనా వహాలా లాగే ఛే వేణ;
సాహేలి సహీం మారీ.
ఘేలు కీధు గోకుళియు రే, ఏనా కామణగారా నేణ;
సాహేలి సహీం మారీ.
నటవర సుందర శ్యామళో రే, మనగమతో మోహనలాల,
హృదయా సరీనో తేఇ లపటావు, మునే ఏవు లాగే ఛే వహాల,
సాహేలి సహీం మారీ.

"సఖి, వినవే! నందనందను డెంతో అందగాడే! అతని పలుకులు కండచక్కెర పలుకులే! అతని కన్నులలో గారడి ఉన్నదే! గోకుల మతనివెంట పిచ్చియెత్తి తిరుగుతున్నదే! వినవే, సఖీ! అతడు సుందరుడే, శ్యాములుడే! ఆ మోహన మూర్తి హృదయసమ్మోహనుడే! అతనిని గట్టిగా కౌగిటిలో పట్టి పిసికివేయవలెనని ఉన్నదే! నా కతడెంత ముద్దు వస్తున్నాడే!"

మరి ఒకటి, అంతకంటె చక్కనిది —

"మోహోలే పధారో మారా రాజ, మాణీగర !
మోహోలే పధారో,
వహాల వధారో వ్రజరాజ, మాణీగర! మోహోలే పధారో;
కరీ రాఖి ఛే ఏకతే, ఘణా దివసనీ ఛే గోఠ,
రాజ మనే తో కీఢీప ఆపీ రహీం ఛే మారే హోఠ;
మాణీగర !...;

హు పరఖే బహు ఆపనే, మారే తో ఏక ఆప,
రహే వాతు నథీ రాజవణ, కోనే కహు పరితాప ?
మాణీగర !...;

సేజ సమారీ ఫూలడే, ఆనంద ఉర న సమాయ,
ప్రాణజీవన ! త్యా పోఢశో, హు తో తళాసీశ పాయ;
మాణీగర !....;

ప్రీతమదాస దయా తణా శ్రీ వ్రజరాజ కుమార !
ఘణా దివసనీ హోస ఛే పూరో ప్రాణాధార! మాణీగర!...

"నారాజా! నా ప్రియుడా! నాయింటికి రారా! నాయింటికి రారా, నన్ను ప్రేమించరా ! ఓ వ్రజరాజా, ఎంతో కాలము నుంచి నా హృదయములో కొన్ని తీయని తలంపులు దాచి ఉంచినాను. అవి నా పెదవులమీాద ఆడుతున్నవి. నా రాజు వస్తే అతనితో చెప్పుతాను. నేను నీ చరణదాసిని; నీవు నా కర గ్రహణము చేసినావు, నన్ను నీ కొంగున పెట్టుకొన్నాను. నా యౌవనము జారిపోతున్నది, రారా. నా రాజా ! నావంటి వారు నీ కెందరో ఉన్నారు. నాకు మాత్రము నీ వొక్కడవే. నా రాజు లేకపోతే నేను జీవింపజాలను. నా విచారము నెవరితో చెప్పుకొందును. పూలతో సెజ్జ సవరించినాను. నా హృదయ మానందముతో కల్లోలిత మవుతున్నది. నా ప్రాణ జీవనమా ! నీవు వచ్చి సెజ్జపై పవ్వళించవూ ? నీ పాదము లొత్తుతాను. ప్రియతమా ! దయాస్వరూపా ! వ్రజరాజా! నీకోసము దినములకొలది ఎదురుచూస్తున్నాను. నా ప్రాణా ధారా ! రారా ! నా కోరిక ఈడేర్చరా !"

తనివి తీరలేదు. మరొక్కటి మాత్ర ముల్లేఖించి ఊర కొంటాను:

హుం శుం జాణు జే వహాలే ముజమాం శు దీఠు ?
వారే వారే సాము భాళే ముఖ లాగే మీఠు ,
హుం శుం జాణు...;
హుం జాఉం జళ భరవా త్యాం ఫుంతే ఫుంతే ఆవే;
వగర బోలావ్యో వాలో వ్హాలడు చడావే; హుం శుం జాణు...;
వధు నే తరఛోడు తోయే రీస న లావే,
కాఇ కాఇ మిషే మారే ఘేర ఆవీ బోలావే,
హుం శుం జాణు...;
దూర థకీ దేఖీ వాలో ము నే దోడయో ఆవీ దోటే,
పోతానీ మాళా కాఢీ పహేరావే మారీ కోటే,
హుం శుం జాణు...;
మనే ఏకలడీ దేఖీ త్యాం మారే పాలవే లాగే,
రంక థఇ కాఇ కాఇ మారీ పాసే మాగే, హుం శుం జాణు...;
ము నే జ్యాం జాత్రీ జాణే త్యాం ఏ ఆవీ థూంకే,
బేనీ ! దయానో ప్రీతమ మారీ కేడ నవ మూకే,
హుం శుం జాణు...

“ అతడు నాలో ఏమి కనుగొన్నాడో నాకు తెలియదు. మాటిమాటికిని నన్ను తేరి పారజూస్తాడు. నా ముఖము మధురముగా ఉన్న దనుకొంటాడు.

నేను నీళ్ళు తేబోతే నా వెంట బడుతాడు. అడుగని దే నీటి కుండ నెత్తుకొనడానికి చేయి సాయ మిస్తాడు. తిట్టి

ఘూ అన్నా వినిపించుకోడు. ఏవో లేనిపోని సాకులు కల్పించు కొని నా యింటికి వస్తాడు.

నన్ను చూచి పరుగెత్తుకొని వచ్చి తన మెడలోని హారమును నా మెడలో వేస్తాడు. ఒంటరిగా చూచి, నా కాళ్ల మీద పడుతాడు. దీనముగా ఏదో చిన్న ఉపకారము కోరుతాడు.

చెల్లెలా! నే నెక్కడకు పోయినా నాకంటబడుతాడే! ఆ దయానిధి నన్ను చల్లగా ఊరుకోనివ్వడే!"

---

# షష్ఠాధ్యాయము

## జానపద కథా వాఙ్మయము

---

సంస్కృత ప్రాకృతములలో లేని కథా వాఙ్మయము ప్రత్యేకముగా అంత మరేదీ దేశభాషలలో లేదు. గుణా ఢ్యుడు పైశాచీ ప్రాకృతములో రచించిన బృహత్కథ నేటికిని కానరాకున్నది. దానిలోని కథలే కొన్ని కథా సరిత్సాగరము, బృహత్కథా మంజరి అనే సంస్కృత కావ్యాలలోని కెక్కి నవి. సంస్కృత పంచతంత్రి కథలు ప్రపంచ మంతటను ప్రాకినవి. బేతాళ పంచవింశతి, సింహాసన ద్వాత్రింశిక, శుక సప్తతి అనే కథా వాఙ్మయములో దేశభాషలలో ప్రచార ములో ఉన్న కథలను సేకరించి సంస్కృతీకరించి ఉంటారు.

గుజరాతీభాషలో ఉన్న కథాసారస్వతము సాధారణముగా పై గ్రంథములలోని కథలనే అనుసరించి ఉంటుంది. ఈ కథలలో క్రొత్తదన మేమిన్నీ లేదు కాని, వాటినుంచి ఆనాటి దేశాచారములను తెలుసుకొనవచ్చును. చిల్లంగి, మంత్రములు, మనుష్యులు జంతువులుగాను, జంతువులు మనుష్యులుగాను మారడము చచ్చినవారిని బ్రతికించడము, పరకాయ ప్రవేశము, మొదలయిన అద్భుత విషయాలతో ఈ కథలు నిండి ఉంటవి. అట్టి గుజరాతీభాషలోని కథలను కొన్నిటిని, తెనుగులో సాధారణముగా వినబడనివాటిని ఈ క్రింద చెప్పుతున్నాము.

## 1. కామకుండల కథ

[ ఇది గుజరాతులో ఎక్కువ ప్రచారములో ఉన్నది. దీనిని ఆనందధరుడు (1300) 'కామకుండలా నాటక' అనే పేరుతోను, గణపతి (1523) 'మాధవానల-దోగ్ధక ప్రబంధము' అనే పేరుతోను, కుశలలాభుడు (1560) మాధవ - కామకుండలా రాస' అనే పేరుతోను, సామలుడు 'మాధవానల' అనే పేరుతోను గుజరాతీభాషలో రచించినారు. నేడీకథ నాటకముగా రచింపబడినది. జనాదరమును పొందినది. ]

అనగా అనగా పుష్పావతీ అనే పురములో మాధవుడు అనే ఒక బ్రాహ్మణు డుండేవాడు. వాడు మన్మథునిలాగు అందముగా ఉండడము చేత ఊరిలోని ఆడవాళ్ళందరున్ను అతనివెంట పడడ మారంభించినారు. అందుచేత ఆ ఊరి మగవారందరున్ను కలిసి రాజయిన కామసేనునితో మొర పెట్టు

కొన్నారు. రాజు వారి మాటలు నిజమో అబద్ధమో అని పరీక్షించడానికి వానిని తన రాణుల యెదుటికి తెచ్చి చూపించే సరికి వారు కూడా వానివెంట పరుగెత్తడానికి తయారైనారు. రాజు బెంబేరుపడు వానిని రాజ్యమునుంచి వెడలగొట్టినాడు.

మాధవుడు దేశాలవెంట తిరుగుతూ తుదకు అమరావతీ పట్టణము చేరుకొన్నాడు. ఆ ఊరి రాజుకు వాని సంగతి తెలిసి, వాని తెలివితేటల కాశ్చర్యపడి వానిని తన మంత్రిసిగా చేసుకొన్నాడు. ఒకనాడు రాజు సభలో కామకుండల అనే వేశ్య నాట్యము చేస్తూ ఉంది. మంత్రికూడా అక్కడనే ఉన్నాడు. అతడు కామకుండల నాట్యము చూచి ఉప్పొంగి పోయి, రాజు తన కిచ్చిన తాంబూలమును దాని కిచ్చివేసినాడు. అది చూచి రాజుకు కోపమువచ్చి, అతనిని తన రాజ్యము విడిచి పొమ్మన్నాడు.

మాధవుడు తన అందమును నిందించుకొంటూ ఊరు విడిచి పోతూవున్న త్రోవలో కామకుండల ఎదురుపడి తన యింటికి రావలసినదని కోరినది. వారిద్దరున్ను ప్రేమించుకొన్నారు. ఆ రాత్రి అంతా కథలు చెప్పుకొంటూ, పొడుపు కథలు పొడుచుకొంటూ తెల్లవారించినారు. తెల్లవారగానే మాధవుడు పోవడానికి సిద్ధపడుతాడు. కామకుండల అతని చెవిలో,

" మాధవా, దయచేసి నీవు వెళ్ళిపోకు. నా యింటిలోనే ఒక నేలమాన్యము త్రవ్వించి నిన్ను దాచుతాను. నీ కిష్టమయితే నా హృదయములో బీగము వేసి ఉంచుతాను.

నా కన్నులలో దాగుకొంటే, కాటుక తెర కప్పి దాచుతాను. ఇదిగో, నీ కాళ్ళమీద పడుతున్నాను, నిన్ను బ్రతిమాలుకొంటున్నాను. దయ ఉంచి పరదేశాలకు పోకు. ఈ అద్దము దగ్గరకు రా. నీ మెడ కౌగిలించుకొని పద్మము తుమ్మెదను బంధించినట్లు బంధించి వేస్తాను. సూర్యు డుదయించినప్పుడా పద్మములో అన్ని రేకులున్నా విడినా, నిన్ను కప్పిన రేకు మాత్రము విడకుండా చేస్తాను. శివుడు తన జడలో గంగను దాచినట్లు నిన్ను నా జడముడిలో దాచివేస్తాను. నేను దిక్కుమాలినదానను. ఈ నా కన్నీళ్లు చూడు. ప్రియుడా, నన్ను విడిచిపెట్టకు. ”

అని బ్రతిమాలుకొంటుంది, కాని, మాధవుడు వినక ఉజ్జయినీ పట్టణమునకు పోతాడు. అక్కడ తన దుఃఖమును వర్ణిస్తూ పద్యములను దేవాలయపు గోడమీద వ్రాస్తాడు. ఆ ఊరి రాజు విక్రము డనేవాడు ప్రజలు తన్ను గురించి ఏమనుకొంటున్నారో తెలుసుకోవలెనని రాత్రి మారువేషముతో తిరుగుతూ, దేవాలయము గోడమీది పద్యములు చదివి, ఒక వేశ్యను పిలిచి ఆ పద్యము లెవరు వ్రాసినవో కనుగొనుమని ఆజ్ఞాపిస్తాడు. ఆ వేశ్య మాయోపాయములు చేసి కనుగొని రాజుతో చెప్పుతుంది. మాధవుని రాజు యెదుట పెట్టి దుఃఖమునకు కారణ మడుగగా తనకు కామకుండల మీద ఉండే ప్రేమను గురించి చెప్పుతాడు. కామకుండలను విడిచిపెట్టవలసినదని విక్రముడు అమరావతి రాజయిన కామసేనునికి వర్తమాన మంపుతాడు ఆ రాజు వదలిపెట్టడు. విక్రముడు వానిమీదికి సైన్యము పంపి విడిపిస్తాడు.

ఆ తరువాత విక్రముడు కామకుండలా మాధవులకు గల ప్రేమ ఎంత దృఢమైనదో పరీక్షించవలెనని మారు వేషము వేసుకొని కామకుండల ప్రేమను సంపాదించవలెనని ప్రయత్నిస్తాడు. కాని, అతని ప్రయత్నము వృథా అవుతుంది. మరొకరీతిగా ఆమెను పరీక్షించవలెనని మాధవుడు చచ్చి పోయినాడని ఆమెతో చెప్పుతాడు. ఆమెకు మూర్ఛవచ్చి చచ్చే అంత అవుతుంది. తరువాత రాజు మాధవునివద్దకు వచ్చి కామకుండల చచ్చిపోయినదని చెప్పుతాడు. మాధవుడు మూర్ఛపోతాడు. తనకు బ్రహ్మహత్య వస్తుందని దుఃఖిస్తూ, రాజు పొడుచుకొని చావడానికి సిద్ధపడుతూ ఉండగా అతని మిత్రుడైన బేతాళుడు పాతాళలోకమునుంచి పరుగుపరుగున వచ్చి, కాముకుల నిద్దరినీ మూర్ఛనుంచి తప్పిస్తాడు. రాజు సంతోషించి, ఆకాశమంత పందిరి, భూదేవి అంత అరుగు వేయించి, వారిద్దరికిన్ని పెండ్లి చేస్తాడు. వారిద్దరున్ను సుఖముగా అచ్చిక బుచ్చికగా కాలము గడుపుతారు. కథ కంచి కెళ్ళింది. మన మింటి కొచ్చాము.

## 2. మారు - ఢోలా కథ

[ దీనిని కుశలాభుడు (1561) మారు–ఢోలా–చుపాఇ అనే పేర రచించినాడు. దీనినే ఆనందోదయుడు 1616 లో వ్రాసినాడు. నవీనముగా దయాభాయి అనే నాటక కర్త 'ఉమాదేవ్డి' అనే పేర చక్కని నాటకముగా తిర్చినాడు.]

మారవాడ దేశములో పుంగళ అనే పట్టణమున పింగళు డనే రాజుండేవాడు. ఝూలోర పట్టణము రాజయిన

సామంతసింహుఁడనేసికి తన కూతురయిన ఉమాదేవి నిచ్చి పెండ్లి చేస్తానని కబురు పంపుతాడు. అంతకు పూర్వము ఉమను పాటణరాజుకున్ను, జునాగఢరాజుకున్ను ఇవ్వవలెనని నిశ్చయమయినది. కాని, రాణికి తన బిడ్డను గుజరాతు దేశమున కివ్వడ మిష్టములేదు. "గుజరాతు నిండా రోగాలు; అక్కడ అందరున్ను పిచ్చివాళ్ళు. మగవాళ్ళకు మగతనము లేదు, ఆడవాళ్ళకు సిగ్గు లజ్జలు లేవు. అటువంటి దేశమునకు మన బిడ్డను నే నిచ్చేదిలేదు" అని ఆమె చెప్పి ఒక ఉపాయము పన్నుతుంది. పాటణరాజున్ను, జునాగఢరాజున్ను ప్రయాణము చేసి రావడానికి వీలు లేనట్లుగా ముహూర్తం పెట్టిస్తుంది. ముహూర్త సమయాని కక్కడ పింగళుఁ డొక్కడే ఉంటాడు. ఉమను ఆ రాజు కిచ్చి పెండ్లి చేసేస్తారు.

ఉమకు మారువాణీ అనే కూతురు పుట్టినది. ఆమెను 'మారు' అని ముద్దుగా పిలిచేవారు. ఆ పిల్లకు ఒకటిన్నరఏళ్ళ వయస్సప్పుడా దేశములో గొప్ప కరవు వచ్చినది. పింగళుఁడు తన ప్రజలతో దేశము విడిచి పుష్కరతీర్థమునకు పోయి ఉండగా, అక్కడకు నలవీరగఢము రాజయిన నలుడు యాత్ర మీఁద తన రాణితోను, మూడేండ్ల వయస్సుగల కొడుకుతోను వచ్చినాడు. ఆ పిల్లవాని పేరు సల్హాకుమారుడు. అతనిని 'ఢోల' అని ముద్దుగా పిలుస్తూ ఉండేవారు.

నలునికిన్ని పింగళునకిన్ని స్నేహ మవుతుంది. ఒకటిన్నర ఏళ్ళ మారును మూడేళ్ళ ఢోలుని కిచ్చి పెండ్లి చేసినారు. నలుడు రాణితోను, కొడుకుతోను తన రాజ్యమునకు పోయినాడు.

దూరదేశము కావడమునుంచి చాలా కాలము గడచి ఫోగాలీ రాజు ఆ పెండ్లిమాటే మరచిపోయినాడు. ఢోలుడు పెద్దవాడయినాడు: వానికి పెండ్లి అయిన సంగతే తెలియదు. వానికి మళవదేశ రాజకుమార్తె అయిన మాళవణి నిచ్చి పెండ్లి చేస్తారు.

ఢోలునికి గుఱ్ఱము లంటే ఇష్టము. గుఱ్ఱముల నమ్మే వాడొకడు మాళవదేశమునుంచి వచ్చి పింగళునితో తన రాజు కూతురిని ఢోలుని కిచ్చి పెండ్లి చేసినారని చెప్పుతాడు. ఈ సంగతి మారుకు తెలుస్తుంది. ఆమె బాల్యమునుంచిన్నీ ఢోలుడే తనకు మగడని నమ్ముకొని వానిమీదనే మనసు పెట్టుకొని ఉన్నది. ఆమెకు దుఃఖ మెక్కువ అయి చెరువు గట్టుకు పోగా అక్కడ ఒక సారసపక్షి కనబడితే దానితో, "పక్షీ, పక్షీ, నీ రెక్కలు నా కియ్యి; నీ మేలు మరువనులే. నా మగనిని చూచి వచ్చి నీ రెక్కలు నీకిచ్చివేస్తాను. ఈ ఉత్తర దేశములో ఉండలేను. నా మనస్సు దక్షిణదేశములో ఉన్నది" అని అంటుంది. ఆ పక్షి వినిపించుకొనక ఎగిరిపోతుంది.

అక్కడ నలవీరగఢములో, ఢోలుని తల్లి మాట జారి అతనికి చిన్నతనములో మారు నిచ్చి పెండ్లి చేసిన సంగతి కొడుకు ఎదుట చెప్పుతుంది. మాళవణి ఆ మాట విని సవతి మీద కోపము తెచ్చుకొంటుంది. పుంగళనుంచి మారు దూతలను పంపింది. వారిని మాళవణి చంపించి, మారు సందేశము ఢోలునికి చేరకుండా చేస్తుంది.

తన మాటలు తిరిగి రాలేదేమని పింగళుడాశ్చర్య పడుతాడు. మారు భట్రాజులద్వారా మళ్ళీ ఢోలునికి సందేశము పంపుతుంది. వారు ఢోలునితో మాట్లాడుతారు. ఢోలుడు పుంగళకు పోవడానికి బయలుదేరుతాడు. వెళ్ళవద్దని మాళవణి బ్రతిమాలుకొంటుంది. ఢోలుడు వినడు. ఢోలుడు ఎక్క బంటెతో, 'ఒంటే, ఒంటే, కుంటిగా ఉన్నట్లు నటించే' అంటుంది. తుదకు 'పోనీ, నేను మేలుకొని ఉన్నప్పుడు పోనని మాట ఇయ్యి' అంటుంది. ఢోలుడు ఒప్పుకొంటాడు. మాళవణి నిద్ర మానివేస్తుంది. కాని, ఎన్నాళ్లు నిద్ర లేకుండా ఉండ గలదు ? ఒకనాడు ఆమెకు నిద్ర వస్తుంది. అప్పుడు ఢోలుడు వెళ్ళిపోతాడు. మాళవణి లేచి ఢోలుడు పోవడము తెలుసుకొని దుఃఖిస్తుంది. ఒక చిలుకచేత మగనిని తిరిగి రమ్మని కబురు పంపుతుంది. చిలుక పోయి ఢోలునితో చెప్పితే " పోయి ఇన్ని కట్టెలు ప్రోగుచేసి, మంట పెట్టి, మాళవణి నందులో పడి చావుమను " అంటాడు.

ఢోలుడు పుంగళపట్టణము చేరుతూ ఉండగా, చంకలో కడవ పెట్టుకొని నీటికి పోతూ ఉన్న మారు వానికి కనబడుతుంది. ఇద్దరున్ను కలుసుకొని ఇంటికి పోతారు. మారు తల్లి దండ్రులు సంతోషిస్తారు. "నేను కనిపెట్టుకొని ఉన్న నామగడు వచ్చినాడు. స్తంభాలు నాట్యము చేస్తున్నవి. ఇల్లు నవ్వుతున్నది. మంచాలు ఆనందముతో గిర్రున తిరుగుతున్నవి" అని మారు అంటుంది. కొన్నాళ్ళీరీతిగా సంతోషముగా గడపి, ఢోలుడు మారుతో తన దేశమునకు బయలుదేరుతాడు.

ప్రోవలో కొంతమందిది అతనితో "జాగ్రత్త. ఉమర్ సుమారా అనేవానికి మొదట మారు నిస్తామన్నారు. వానికి నీమీద కోపముగా ఉన్నది. నిన్ను వాడు చంపుతాడు సుమా" అని చెప్పుతారు. ప్రోవలో మారును ఒక పాము కరుస్తుంది. ఆమె చచ్చిపోతుంది. ఆ దుఃఖముచేత ధోలుడు మారు చితిమీద నెక్కి తాను చచ్చిపోనెంచి. ఆ వృత్తాంతము తనవారితో చెప్పవలసినదని తన ఒంటెతో చెప్పుతాడు. కాని, పార్వతీ పరమేశ్వరులు ఆకాశముమీద ఆ దారిని పోతూ అంత గాఢము ప్రేమించుకొన్న మారును బ్రతికిస్తారు. ప్రోవలో ఉమరా మనుష్య లెదురుపడి ధోలునితో మద్యము త్రాగుదాము రమ్మంటారు. త్రాగి మైమరచి ఉన్నప్పుడు ధోలుని వారు చంపుతారని గ్రహించి, త్రాగవద్దని మారు ధోలునితో అంటుంది. ఇద్దరున్ను ఒంటె నెక్కి గబగబ పోతూ ఉంటే, ఉమరా మనుష్యులు వెంటబెట్టుతారు ఒంటె మరింత వేగముగా పరుగెత్తి వారిద్దరిని నలవీరగఢమునకు చేరుస్తుంది. అందరున్ను సుఖముగా ఉంటారు. ధోలుడు మారును, మాళవణిని సమానముగా చూచుకొంటూ వారితో అచ్చిక బుచ్చికలాడుకొంటూ హాయిగా ఉంటాడు. కథ కంచి కెళ్ళింది. మన మింటి కొచ్చాము.

## 3. విద్యావిలాస కథ

[ ఈ కథ వినయచంద్రుడు (1229) సంస్కృతములో రచించిన మల్లినాథ మహాకావ్యము లోనిది. దీనిని హీరానందుడు 1429లో 'విద్యావిలాసనోపవాడో' అనే గ్రంథముగా

వ్రాసినాడు. దీనినే శామలుడు 'వినేచేతసినానాత్రా' అనే గ్రంథముగా రచించినాడు.]

అనగా అనగా కాంచనపుర మనే పట్టణములో శ్రీపాలుడనే నగరసెట్టి ఉండేవాడు. అతనికి నలుగురు కొడుకులు. సెట్టి కొడుకులను పిలిచి, "ధనము సంపాదించడానికి మంచి మార్గ మేది?" అని ఒకొక్కని అడిగినాడు. మొదటి ముగ్గురున్ను కోమట్లు సాధారణముగా అవలంబించే మార్గములను చెప్పినారు. నాలుగోవాడు శుద్ధ మొద్దు. తెలివి తక్కువవాడు. వాడు, "నేను రాజులాగు రాజ్యముచేసి డబ్బు సంపాదిస్తాను" అన్నాడు. తండ్రికి కోపమువచ్చి యింటిలోనుంచి వానిని తరిమివేసినాడు.

ఆ పిల్లవాని పేరు శ్రీవత్సుడు. వాడు రత్నపురమును చేరుకొని, అక్కడ ఒక గురువు నాశ్రయించి, అతని బడిలో చదువుకొంటూ ఉండేవాడు. వానితో ఆ బడిలో ఆ ఊరి రాజు కొమార్తె, మంత్రి కొడుకు కూడా చదువుకొనేవారు. రాజు కొమార్తె మంత్రి కుమారుని ప్రేమించి తన్ను పెండ్లాడు మన్నది. మంత్రికుమారుని కామెను పెండ్లాడడ మిష్టము లేదు. 'అట్లాగేలే' అని గడువులు పెట్టుతూ ఉండేవాడు. ఒకనాడు రాజు కుమార్తె గట్టిగా నిర్బంధించినది. ఆ పోరు పడలేక మంత్రికొడుకు ఒక ఉపాయము చేసినాడు. శ్రీవత్సుని పిలిచి, "నిన్ను రాజు కొమార్తె పెండ్లాడుతుంది. రాత్రి ఒక ఒంటె సిద్ధముగా ఉంటుంది. నా దుస్తులు తొడుగుకొని రాజు కొమార్తెను ఒంటె మీద ఎక్కించుకొని తీసుకొని పో"

అని చెప్పుతే వాడంగీకరించినాడు. వాడు సాయంత్రము గురువు దగ్గరకు పోయి, "నేను రాజు కొమార్తెను పెండ్లాడుతాను. ఈ రాత్రి వెళ్ళిపోతాము. సెల వియ్యండి" అని అడుగుతాడు. గురువు వాని అవివేకము చూచి, జాలి పుట్టి, వానికి తెలివి తేట లివ్వవలసినదని సరస్వతిని ప్రార్థిస్తే, సరస్వతి ప్రత్యక్షమై, శ్రీవత్సుని నోటిలో మంత్రించిన నీళ్ళు పోయగానే వాడు గొప్ప తెలివిగలవా డయినాడు. రాత్రి చీకటిలో శ్రీవత్సుడే మంత్రి కొడు కనుకొని రాజకుమార్తె వానితో ఒంటె నెక్కినది. వా రొక అడవిమార్గము పట్టి పోయినారు. తెల్లవా రే సరికి ఆమె వానిని చూచి, "అయ్యో, ఎంత ప్రమాద మైనది. తెలివి తక్కువవానితో కాపురము చేయవలెనే!" అని దుఃఖించి, వానితో మాట్లాడడము మానివేసినది. వారు ఉజ్జయినీ పట్టణము చేరుకొన్నారు. ఆ ఊరికి రత్నకేతుడు రాజు. ఆ రాజు శ్రీవత్సుని తెలివితేటలను గురించి విని వానిని తన మంత్రిగా చేసుకొన్నాడు. వాడున్ను రాజుకు మంచి సలహా లిస్తూ, ప్రజ లందరున్ను మెచ్చుకొనేలాగు నడుచు కొంటున్నాడు. తన మగని తెలివితేటలను గురించి అమ్మలక్క లందరును రాజు కొమార్తెతో చెప్పుతూ ఉండేవారు. ఆమె నమ్మేది కాదు. మేడమీదనే ఎల్లప్పుడున్ను ఉండేది. మగనితో మాట్లాడేదికాదు. "ప్రజలనందరిని శ్రీవత్సుడు మెప్పిస్తున్నాడు, తన భార్యను మెప్పించలేకపోతున్నాడే! ఆమె ఎటువంటిదో." అని రత్నకేతురాజుకు అనుమానము కలిగి, మంత్రితో "నే నీరాత్రి మీ యింటికి భోజనమునకు వస్తాను. వంట చేయించి, నీ భార్యచేత వడ్డింపించు" అని చెప్పినాడు.

మంత్రిఒప్పుకొని ఆసంగతిభార్యకుకబురుచేసినాడు. రాజుభోజనమునకు వచ్చినాడు. రాజుకొమార్తె వడ్డిస్తూ వడ్డిస్తూ మూడు వేరు వేరు రంగుల చీరలను మార్చి కట్టుకొన్నది. వేర్వేరు స్త్రీలు వచ్చి వడ్డిస్తున్నారనుకొని మంత్రి భార్య ఎవ్వతో రాజు కనుగొనలేక ఇంటికి పోయినాడు. ఆమెను గురించి తెలుసుకొనవలెననే పట్టుదలతో అతడు మంత్రితో "మంత్రీ, నీ భార్య బాగుగా పాడగలదట. ఈ సాయంత్రము నేనున్నూ, రాణిగారున్నూ దేవాలయమునకు పోతాము. అక్కడ నీభార్య పాడవలెను" అని చెప్పినాడు. ఆ మాట శ్రీవత్సుడు భార్యకు చెప్పి పంపగా ఆమె, "నా భర్త నేను పాడుతున్నప్పుడు మద్దెల వాయించవలెను" అన్నది. శ్రీవత్సు డొప్పుకొన్నాడు. సాయంత్రము ఊరిబయట నున్న దేవాలయములో రాజుకొమార్తె అద్భుతముగా పాడినది. మంత్రి అంతకంటె అద్భుతముగా మద్దెల వాయించినాడు. తన మగడు తెలివి గలవాడే అని రాజుకొమార్తెకు నమ్మకము కలిగినది. రాజు సంతోషించి వారిద్దరిని పల్లకిలో కూర్చుండబెట్టి ఊరేగించినాడు. త్రోవలో రాజుకుమార్తె వ్రేలి ఉంగరము జారి ఎక్కడనో పడిపోయినది. ఆ సంగతి ఆమె మగనితో చెప్పినది. శ్రీవత్సుడు పల్లకి దిగి ఉంగరము వెదుక బోయినాడు. తక్కినవా రందరును ఊరిలో ప్రవేశించి ఎవరి ఇళ్ళకు వారు పోయినారు. మంత్రి కుమారుడు ఉంగరము వెతకి తిరిగి వచ్చేసరికి అర్ధరాత్రి అయినది. ఊరి వాకిళ్ళు మూసివేసినారు. అందుచేత అతడు గోడక్రింద ఉన్న ఒక కాలువలోనుంచి దూరి ఊరిలో ప్రవేశించబోగా, అక్కడ ఒక పాము కరచినది. విష మెక్కి

కోటికెంట నురగలు క్రక్కుతూ ఉన్నాడు. ఆ దారిని ఒక వేశ్య వానినిచూచి, జాలి పుట్టి, మంత్రములు వేసి, మందిచ్చి బాగు చేసినది; తన యింటికి తీసుకొనిపోయి, "నీవు నాతోనే నా యింటిలో ఉండవలెను. నీమీద నాకు ప్రేమ పుట్టినది" అని చెప్పినది. ఒకవేళ అతడు తనతో చెప్పకుండ పోతాడేమో అని వాని కాలికి ఒక దారమును మంత్రించి కట్టినది. వెంటనే శ్రీవత్సు డొక నెమలిగా మారిపోయినాడు. పగలంతా దారము కట్టి ఉండడము చేత అతడు నెమలిగా తిరుగుతూ ఉండేవాడు. రాత్రి దారము తీసివేయగానే మనుష్యుడయి ఆమెతో ఉండేవాడు. నెమలిగా మారినా శ్రీవత్సుని మనస్సు రాజకుమార్తె మీదనే ఉండేది గనుక, ఆ రాజకుమార్తె మేడమీద వ్రాలి, ఆమె దుఃఖమును చూడలేక తానున్ను దుఃఖిస్తూ ఉండేవాడు. ఒకనాడు రాజకుమార్తె చెలికత్తె నెమలిని పట్టుకొని కాలి దారమును తీసివేసినది. వెంటనే అతడు మనుష్యుడయినాడు. రాజకుమార్తె అయిన సౌభాగ్య మంజరి సంతోషించినది. తన కష్టమంతా శ్రీవత్సు డామెకు తెలిపినాడు. కాని, తాను మాట యిచ్చినాడు గనుక వేశ్య వద్దకు పోక తీరదని వెళ్ళిపోయినాడు. ఈ విషయమంతా సౌభాగ్యమంజరి రాజుతో చెప్పగా రాజు వేశ్యను, శ్రీవత్సుని పిలిపించి, శ్రీవత్సుని సౌభాగ్యమంజరి వరము చేస్తాడు. వేశ్య కూడా ఆ ఆలుమగల నంటిపెట్టుకొని వారితోనే ఉంటుంది. కొన్నాళ్లకు రత్నకేతుడు ముసలివాడై రాజ్యమును శ్రీవత్సుని కిచ్చి తాను తపస్సుకోసము అడవికి పోయినాడు. శ్రీవత్సుడు తన తల్లిదండ్రు లున్న ఊరి రాజుమీదికి దండెత్తి పోయి,

అతనిని ఓడించి తానే ఆ ఊరికి కూడా రాజవుతాడు. తండ్రి సంతోషిస్తాడు. అందరున్ను సుఖముగా ఉంటారు. కథ కంచి కెళ్ళింది. మన మింటి కొచ్చాము.

## 4. రూపచందుని కథ

[ఈ కథను నయసుందరు డనే కవి (1560_1620) తన రూపచంద్ర కువరరాస' అనే గ్రంథములో వ్రాసినాడు. ఇతని శిష్యురా లయిన హేమశ్రీ 'కనకావతి' అనే ఒక కథను కావ్యముగా వ్రాసినది. నయసుందరుడు పై గ్రంథమునే కాక 'సురసుందరీ రాస', 'ప్రభావతీ రాస' అనే మరి రెండు స్వకపోల కల్పిత కథలను కూడా వ్రాసినాడు.]

అనగా అనగా మాళవదేశమునకు రాజధాని అయిన ఉజ్జయినీ పట్టణములో ధనదత్తుడు అనే ఒక సెట్టి ఉండేవాడు. అతని భార్య ధనసుందరి. వారికి లేక లేక ఒక కొడుకు పుట్టినాడు. చంద్రునివలె ప్రకాశించడముచేత వానికి రూప చందుడు అని పేరు పెట్టినారు. రూపచందుడు సమస్త విద్య లను, కళలను నేర్చి పెద్దవా డయినాడు.

కనూజదేశపు రాజుకు సామన్తుడైన గుణసేను డనే వాడు ఉజ్జయినిలో కాపురం పెట్టుకున్నాడు. అతనికి సన్నేహా? అనే చక్కని కూతు రున్నది. ఆమె పెండ్లి చేసికొన నని పంతము పట్టింది. ఆమెకు పదిహేడేండ్లు వచ్చినవి. నిండు యౌవనములో ఉంది. ఒకనా డామెకు నాటకము చూడ బోవలె నని బుద్ధి పుట్టినది. పెండ్లి కానివాళ్లు నాటకాలు

చూడకూడ దని ఆమె చెలికత్తె అన్నది. ఐతే నాకు నచ్చిన వాడు ఎక్కడ చిక్కుతా డని స్వహాగా అడిగినది. "దాని కేమున్నది. ఆడదానికి మగడే చిక్కకపోతాడా. ఏ విషయములోనైనా ఆడదానిదే పైచేయి. ఒక్క క్షణములో జలజల కన్నీళ్లు రాల్చగలదు. మరుక్షణములో ఒక్క చిరునవ్వు నవ్వి మగవారి మనస్సును కలత పెట్టగలదు. ఒకటి చెప్పి ఒకటి చేయగలదు. ఆడుదానికి ప్రపంచములో పాటి యెవరు?" అని చెప్పి విక్రమరాజు కొడుకును తీసికొని వస్తుంది. స్వహాగా అతనిని పొడుపుకథ లడుగుతుంది. అతడు ప్రత్యుత్తరం చెప్ప లేక యింటికి పోతాడు. ఆ సాయంత్రము ఎదుటి అంగటిలో తమలపాకులు కొంటూ ఉన్న రూపచందు డామెకంట పడ తాడు. వానిని తీసికొని రమ్మంటుంది. వానిని రమ్మంటే నీవెవ్వరో నాకు తెలీదు. నీస్వహాగా అంతకంటె తెలీదు. నేను రా నంటాడు. ఆ చెలికత్తె అతనితో, "నిన్నామె తన కండ్లతో ఒక్కసారి చూచిందో లేదో కాని ఆమె నీవంటే పిచ్చెత్తి పోయినది, క్షణ మొక యుగముగా గడపుతున్నది. పద్మిని సరస్సులో ఉంటుంది. సూర్యు డాకాశముమీద ఉంటాడు. సూర్యుడు కనబడితేనే గాని పద్మిని వికసించదు. అని చెప్పు తుంది. రూపచందుడు ఎట్లో ఒకలాగు ఒప్పుకొని స్వహాగా వద్దకు వస్తాడు. ఆమె నిరుపమాన సౌందర్యమున కాశ్చర్యపడి ఆమెను మోహిస్తాడు. స్వహాగా అతనితో, "నా కళ్ళల్లో కనబడుతూ వచ్చిన ప్రియుడ వచ్చముగా నీవే. నిన్ను చూడ డానికి ఇంద్రుని వేయి కండ్లనూ ఎరువు తెచ్చుకోవాలి

అంటుంది. తర్వాత వారిద్దరున్నూ పొడుపుకథలతో కాలము బుచ్చుతారు.

తన్ను నిరాకరించిన స్వాహాగా రూపచందుని మోహించినదని గూఢచారులు విక్రమునితో చెప్పుతారు. రాజు ధనదత్తునీ, అతని కొడుకులను పిలిపిస్తాడు. వారితో ఊరి మహాజనులుకూడా వోయి ధనదత్తుని విషయమై వాదిస్తారు. రాజు రూపచందుని తప్ప తక్కినవారిని విడిచిపెట్టి, రూపచందుని కోటలోనికి తీసికొనిపోయి స్వాహాగా అడిగిన పొడుపుకథలకు ఏమి సమాధానము లిచ్చినావని అడుగుతాడు. రూపచందుడు ఏమీ తెలియని మొద్దువలె నటిస్తూ, "నేను కోమటోణ్ణి చింతపండు మిరపకాయలూ తూచుకునేవాణ్ణి. కోమటోడికి తెలివెక్కడుంటాది. బెల్లమున్నదా అంటే అల్లమున్నదని చెప్పి తప్పించుకునేవాణ్ణి. రాజు కూతురు ప్రశ్నలకు నా మొహం నేను జవాబు చెప్పగలనా" అని అంటాడు. రాజతనిని ఊరిలో తిప్పించి కొరడాదెబ్బలు కొట్టిస్తాడు. ఎంత కొట్టినా రూపచందుడు తన రహస్యము చెప్పడు. తుదకు రాజు వానితల దీసివేయవలెనని ఆజ్ఞాపిస్తాడు, ఊరంతా గగ్గోలవుతుంది. ప్రజల అభిప్రాయమును తెలుసుకొని రాజు తన ఆజ్ఞను రద్దుచేస్తాడు. కాని స్వాహాగా పాడిచిన పొడుపుకథలకు ప్రత్యుత్తరము లేమో తెలుసుకొనవలెనన్న కుతూహలము రాజుకు పోలేదు. అందు కోసము రూపచందునికి తన కూతురునిచ్చి పెండ్లిచేస్తాడు. ఈసంగతి తెలిసి స్వాహాగా రూపచందునికి ఒక జాబు వ్రాస్తుంది. రూపచందుడు దానికి తగినట్లుగా ప్రత్యుత్తరం పంపుతాడు. రాజు కుమార్తె ఒక

నాడు రూపచందునికి కాళ్ళొత్తుతూ స్వాహాగా పొడుపు కథలకు ప్రత్యుత్తర మేమిచ్చినారని అడుగుతుంది. అతడామెకు చెప్పుతాడు. ఆమె పోయి రాజుకు చెపుతుంది. రాజు పరమానంద భరితుడై స్వాహాగా రూపచందుల వివాహాము చేస్తాడు.

## ౫. ధనవతి కథ

[ఈ కథ గంగావిజయుని (1652) కుసుమశ్రీకాస అనే గ్రంథములోనిది. దీనిలో కవి హాస్యరసము నెక్కువగా చూపినాడు.]

అనగా అనగా రత్నపురము అని ఒకపట్టణ ముండేది. దానిలో ధనసుందరుడనే ఒకశెట్టి ఉండేవాడు. అతని భార్య పేరు ధనవతి. శెట్టి దూరదేశానికి వ్యాపారంకోసం పోతూ భార్యను రాజ పురోహితునింట్లో ఉంచిపోతాడు. ఆ పురోహితుడు ఆమె అందమునూ, తెలివినీ చూచి ఆమెను మోహిస్తాడు. ఆమె అతనితో ఎంతచెప్పినా ఒప్పుకోడు. తన నిస్సహాయతను గుర్తించి "సరే మాయింటికి రాత్రి మొదటి జాములో రా"అని చెప్పి తప్పించుకొంటుంది. తప్పించుకొని దుర్గపాలుడనే కొత్వాలుదగ్గర పురోహితునిమీద ఫిర్యాదు చేస్తుంది. వాడు 'నీవు నన్ను ప్రేమిస్తే నిన్ను పురోహితుని నుండి తప్పిస్తా' నంటాడు. ఏమిచేయటానికి తోచక "సరే నీవు రాత్రి రెండో ఝాముసు మా యింటికిరా" అని చెప్పి తిన్నగా మంత్రిదగ్గరకు పోయి మొరపెట్టుకుంటుంది. 'నీవు నన్ను కామిస్తే వారిద్దరినుంచీ నిన్ను తప్పిస్తాను' అంటాడు.

డికుంటుతోచక, "సరే రాత్రి మూడో ఝామున మాయింటికి రా" అనిచెప్పి తిన్నగా రాజుదగ్గరకే పోయి చెప్పుకుంటుంది. రాజు "నన్ను ప్రేమిస్తే నిన్ను వారినుంచి తప్పిస్తా" నంటాడు. ఏమిచేయడానికిన్నీ తోచక "సరే నీవు రాత్రి నాలుగో ఝామున మాయింటికి రా" అని చెప్పి యింటికి పోయి ఒక ఉపాయ మాలోచిస్తుంది. నాలుగరలతో ఒక పొడుగుపాటి పెట్టెను చేయించి ఉంచుద్ది. చీకటి పడినది పురోహితుడు వచ్చినాడు. వానికి బాగుగా భోజనముపెట్టి మాటలల్లోనికి దించుతుంది. మొదటి ఝాము గడచిపోతుంది. కొత్వాలు తలుపు తట్టుతాడు. పురోహితుడు భయపడి తన్ను రక్షించ మంటాడు. ఆమె అతనిని పెట్టెలోని ఒక అరలో దాచి మూత వేస్తుంది. కొత్వాలునుకూడా అదేరీతిగా మాటలతో మరపించి రెండోఝాము గడిపేస్తుంది. మంత్రి తలుపు తట్టుతాడు. కొత్వాలును రెండో అరలో దాచివేస్తుంది. అదే విధముగా మంత్రి వస్తాడు వాడినికూడా తక్కిన అరలో పెట్టేస్తుంది. రాజు వస్తాడు. ఆ క్రిందటి మధ్యాహ్నమే ఆమె ఒక ముసలమ్మను దగ్గర చేర్చుకొని తన ఆపదను గురించి ఆమెతో చెప్పి తెల్లవారగనే ధనసుందరుడు పరదేశములో చచ్చిపోయినాడు అని పుకారా పుట్టించ మంటుంది. ఆ ముసలమ్మకూడా అట్లే చేస్తుంది. రాజుకు ధనవతి చక్కని మాటలు చెబుతూ ఉన్న సమయంలో ఊరిలోని అమ్మలక్క లందరూ ఎక్కువగా ఏడుస్తూ "అయ్యో ధనవతీ నీ కెంత ఆపద వచ్చిందమ్మా" అని తలుపు తట్టుతారు. ధనవతి రాజును నాలుగో అరలో పెట్టి మూత వేసేస్తుంది.

ధనసుందరికి పిల్లలు లేరుగనుక ధనసుందరుని ఆస్తంతా దివాణమునకు చెందుతుంది అని ఉద్యోగస్తులు అనుకొని రాజు దగ్గరకు పోయేసరికి కోటలో రాజు లేడు. మంత్రి, కొత్వాలూ, పురోహితుడుకూడా లేరు. అందుచేత రాణి ధనసుందరిని ధనమంతా తీసుకరావలసినదని ఉద్యోగస్తుల కాజ్ఞాపిస్తుంది. ఉద్యోగస్తులు పోయి 'నీ మగని ధన మెకడున్నదో చూపు అంటారు." అదేమో నాకు తెలియదు. ధన మెక్కడ పెట్టేవాడో నాకు తెలిపేవాడు కాడు. అదిగో ఆపెట్టెలో ఉంటుందేమో చూచుకోండి అంటుంది. వారా పెట్టె నెత్తపోగా చాలా బరువుగా ఉండి, ధనసుందరుడు కూడపెట్టిన ధనమున కాశ్చర్యపడి, పెట్టెను మోసుకొనిపోయి రాణియెదుట పెడుతారు. నలుగురి ఎదుటా పెట్టెను తెరిస్తే దివాణమునకు చెందిన ధనమునుగురించి అందరికీ తెలుస్తుందని అందరినీ పంపించివేసి, మొదటి అరను తెరుస్తుంది. చెమటలు పోసుకుంటూ పురోహితుడు బయటికి వస్తాడు. ఇదేమిటిది అని పురోహితు నడుగగా వాడు మాట్లాడకుండా, రెండో అర వంక చూపుతాడు. ఈ రీతిగా వరుసగా కొత్వాలు, మంత్రీ, రాజూ కూడా బయటికివచ్చి సిగ్గుతో తల వంచుకుంటారు. రాణి వారి నందరినీ చీవాట్లు పెట్టుతుంది. ఈలోగా ధన సుందరుడుకూడా పరదేశములనుంచి వస్తాడు. తన భార్య తెలివితేటలకు మెచ్చుకొంటాడు. అందరూ సుఖంగా

టారు. కథ కంచి కెళ్ళింది. మన మింటికొచ్చాము.

ఇటువంటి కథలు గుజరాతీ వాఙ్మయములో ఇంకా చాలా ఉన్నవి. వాటి నిప్పటికిన్నీ గుజరాతీవారు విశ్రాంతిగా ఉన్నప్పుడు చెప్పుకొంటూ ఉంటారు.

---

# సప్తమాధ్యాయము

## నవయుగ వాఙ్మయము

ఇండియా ప్రభుత్వము తూర్పిండియా కంపెనీవారి చేతులలో నిలిచిననాటినుంచిన్నీ దేశములో ఒక క్రొత్త మార్పు కలిగినది. దేశీయ సంస్కృతిని గురించి తెలుసుకోవలెనని పాలకులకున్నూ, ప్రభువుల సంస్కృతినిగురించి తెలిసికోవలెనని పాలితులకున్నూ ఉత్కంఠ గలిగినది. దేశములో ఇంగ్లీషు బడులు? కళాశాలలు, విశ్వవిద్యాలయములు స్థాపించినారు. దేశీయులు పాలకుల భాషయైన ఇంగ్లీషు నభ్యసించ మొదలుపెట్టినారు. ఇంగ్లీషు వాఙ్మయమున్నూ, ఇంగ్లీషు చరిత్రమున్నూ, చదువుతున్నకొద్దీ స్వాతంత్ర్యాభిలాష ఎక్కువ కాజొచ్చినది. సంఘములోని దురాచారములను తొలగించవలెనని సంఘ సంస్కర్తలు బయలుదేరినారు. తెనుగు దేశములో వీరేశలింగము, బంగాళములో ఈశ్వరచంద్ర విద్యాసాగరుడు, హిందీ ప్రాంతములో లల్లూజీలాలులవలె, గుజ

రాతు దేశములో నర్మదాశంకర్ లాల్‌శంకర్ (1833–1886) అనే వ్యక్తి బయలుదేరినాడు. ఇతడు నాగర బ్రాహ్మణుడు. ఇతనికి బాల్యములోనే వివాహము జరిగినది. పదిహేడేండ్ల ప్రాయముననే భార్య యింటికి వచ్చినది. కాబట్టి అతడు చదువు మానివేయవలసి వచ్చినది. ఈలోగా భార్య చని పోయినది. అతడు తిరిగి చదువులో ప్రవేశించినాడు. బుద్ధి వర్ధక సంఘమును స్థాపించి దాని అభివృద్ధికోసం పాటుపడి నాడు. ఇతనిది సునిశితమైన బుద్ధి. పట్టరాని కోపము. అంతములేని ఆత్మాభిమానము. నిరుపమాన ధైర్యము. అసమాన వాక్చాతుర్యము. చదువు వదలిపెట్టగానే ఉద్యోగ ములో ప్రవేశించినాడు కాని అతనికది నచ్చలేదు. దేశములో అన్నివిధములా విప్లవము కలుగవలెనని అతని ఆశయము కాబట్టి ఉద్యోగమునకు రాజీనామానిచ్చి తన కలము మూల ముగా దేశములో గొప్పమార్పుకలిగించడానికిపూనుకొన్నాడు. సంఘముమీద తిరుగబడ్డాడు. రజస్వలానంతర వివాహములు, విధవా వివాహములు చేస్తేనేకాని, దేశము బాగుపడదని బోధింపసాగినాడు. అతనిని సంఘము బహిష్కరించినది. అతడు సంఘమును లక్ష్యపెట్టలేదు. ఎన్ని కష్టములు వచ్చినా భరించి తిండికి లేకపోయినా ఉపవాసము లుండి, తన అభి ప్రాయములను లోకమునకు చాటెనాడు.

నర్మదునికి ప్రాచీన గుజరాతీ వాఙ్మయమంటే చాలా ఇష్టము. ప్రాచీన గుజరాతీ లిఖిత గ్రంథముల నెన్నిటినో సంపాదించి వాటిని పరిష్కరించి అచ్చు వేయించినాడు.

తాను స్వయముగా ఎన్నో గ్రంథములను వ్రాసినాడు. పింగల ప్రకాశ, అలంకారప్రవేశ, రసప్రవేశ: నాయికా విషయ ప్రవేశ అనే ఛందోలంకార గ్రంథములను, నర్మకోశమనే నిఘంటువునూ, నర్మ కథాకోశము అనే పౌరాణిక కథల నిఘంటువునూ రచించినాడు. అతడు వ్రాసిన గద్యకావ్యములు నర్మ గద్య అనే సంపుటముగానూ, పద్య కావ్యములు నర్మ కవిత అనే సంపుటముగానూ ప్రకటింపబడినవి. ఇతని పద్య కావ్యములలో 'వనవర్ణన' ప్రవాసవర్ణన, ఋతువర్ణన అనేవి అతని కవిత్వ ప్రశస్తిని చాటుచున్నవి. అతని దేశభక్తి నిరుప మానమైనది. ఒక ఖండకావ్యములో అత డీ రీతిగా వ్రాసి నాడు.

హిందూ దేశ నాహాల, థయా ఛే భుండా ఆజే
సత్తా మోత్ఖీ ఖోఈ, నీచు ధే జోవ లాజే.

ఈ హిందువుల మాతృదేశము అధోగతి పట్టినది. దానిశక్తి ఉడిగినది. సిగ్గుతో తల వంచుకుంటున్నది.

"దేశ ప్రీత హంకార, ఛుపా సూతా కహో ఆజే?"

... .... ... ...

వినా దేశ అభిమాన, దేశ ఉత్కర్ష న థాప,
దేశ రాన సమశాన, జేహాట భావా ధా ప;
రాజ సమంధీ ఐక్య, నథీ అవానా లోకోమా,
జాతి బంధనో ఖుబ,
జనో వాఘోనా మోమా,

ఆమెపై మనకుగల ప్రేమ ఎక్కడకు బోయినది. ఇది మన దేశమనే గర్వ మెక్కడకు పోయినది. దేశాభిమానము లేకపోతే దేశ ముచ్ఛస్థితికి రాలేదు. అది లేకపోతే దేశమొక అరణ్యము; భయంకరమై మింగివేస్తుంది. జనులలో జాతీ యైక్యతలేదు. జాతిబంధములతో జనులు భిన్నాభిన్న మైనారు. వారు ఒక పెద్దపులి దవుడలలో ఇరుకుకొన్నారు.

జయజయ గరబీ గుజరాత!
జయజయ గరబీ గుజరాత!
దీప్పే అరునూ పరభాత
ధ్వజ ప్రకాశశే ఝుళళళళ కుసుంబీ, ప్రేమశౌర్యఅంకీత
తుంభణవభణవ నిజసంతతి స ఉనే, ప్రేమ భక్తి సీరీత
ఉంఛీ తుజ సుందరజాత

... ... ...

తే అణ హిల వారణ రంగ
తే సిద్ధరాజ జయసింగ;
తే రంగథకీపణ అధిక సరస రంగ, థశేసత్వరే మాత
శుభశకున దీసే మధ్యాహ్నశోభశే, బీతీ గఇ ఛేరాత
జన ఘూమే నర్మదా సాథ,
జయజయ గరబీ గుజరాత.

గర్వమైన గుజరాతమా నీకు జయము జయము జయము జయము గర్వమైన గుజరాతమా. అరుణ ప్రభా తము మరల కనబడినది. కుసుంభ వర్ణధ్వజము తిరిగి ఎగురును. దానిమీద ప్రేమ శౌర్యములు లిఖింపబడి ఉండును. నీ ఆత్మ మహోన్నత మైనది.

తల్లీ, అనహిలవాడ పూర్వౌన్నత్యము, సిద్ధరాజ జయసింహుని మహాత్మ్యము, ఇంకను అధికకాంతితో బయలుదేరగలదు. దాని చిన్నెలు నాకు కనబడుతున్నవి. రాత్రి పోయినది మధ్యాహ్నము సమీపిస్తున్నది. నర్మదునితో కూడా జనులు ముందుకు సాగుతున్నారు

సహు చల్లో జీతవా జంగ, వ్యూగలో వాగే,
యా హోమ కరీనే పడో, ఫత్తేహ ఛే ఆగే;
సాహాసే కోలంబస గయో, న పీ దునియా మా
సాహాసే నేపోల్యన భీద్యో, యురప ఆ భామా.

* * *

సాహాసే జాతినా బంధ, కాపి ఝట్ నాంఖో,
సాహాసే ఝాట పరదేశ, బ్హీక నవ రాఖో.

రండి. మీలో ప్రతిఒక్కరునూ రండి. యుద్ధములో జయించండి. భేరీభాంకారములు ధ్వనిస్తున్నవి. నడవండి. ముందుకు నడవండి. యుద్ధ మధ్యమునకు దుముకండి. మీకోసము జయలక్ష్మి ఎదురు చూస్తున్నది. కొలంబసు నిర్భయముగా పోయి ఒక క్రొత్త ప్రపంచమును కనుగొన్నాడు. నెపోలియను నిర్భయముగా ప్రపంచ మంతటితోనూ పోరాడినాడు. మీరున్నూ జాతి వర్ణ శృంఖలములను నిర్భయముగా త్రెంపివేయండి. పరదేశములకు నిర్భయముగా పొండి. భయపడకండి.

స్త్రీస్వాతంత్ర్యమన్నా నర్మదునికి ప్రాణము. "సంస్కరణ మంతటికిన్నీ స్త్రీ మూలము. ఆమె హక్కులు పురుషు

నితో సమానములు. ఇకముందు స్త్రీ ఒక చేతినుండి మరియొక చేతికి మారే వస్తువుగా ఉండకూడదు."

నర్మదుని కాలమునుంచిన్నీ నవీన గుజరాతీ వాఙ్మయము అతిశీఘ్రముగా అభివృద్ధికి వచ్చినది. నర్మదుని సంస్కరణమును అరికట్టడానికి ప్రయత్నించిన వారి వాఙ్మయము కూడా బయలుదేరినది. రెండు పక్షములవారున్నూ వ్రాసిన గ్రంథములలో మిక్కిలి శ్రేష్ఠమైన వెన్నో ఉన్నవి. కవిత్వములో కొత్తపోకడలు బయలుదేరినవి. క్రొత్తరీతి నాటకములు రచింపబడినవి. ఆనాటి గొప్ప గ్రంథకర్తలలో గోవర్ధనరామ్ మాధవరామ్ త్రిపాఠీ, మణిలాల్ నభూభాయి ద్వివేది, నరసింహారావ్ భోలానాథ్ దివేతియా అనేవారు ముఖ్యులు. వీరిలో నరశింహారావు వ్రాసిన కుసుమమాల, హృదయవీణ, నూపుర ఝాంకార, అనేవి ఇంగ్లీషు కవులైన వర్డ్సువర్తు, షెల్లీల మార్గము ననుసరించినవి.

కొన్ని యుదాహరణములు :—

నాహానే ఉర మాహరు, ఆజ ము లాచార ఛు,
నా రువే ఉర మాహాటు, ధారు అక థకో భార హు

* * *

వాణీ వదలీ నాగమే, మూక భార వహు ఉరే,
తదపి వాణీ మాపమా, ఏ భార ఉర హలకో కరే.

నా హృదయము నవ్వదు. నేడు నిస్సహాయుడనైనాను. నా హృదయము భారముతో క్రుంగిపోతూ ఉన్నా కన్నీటిని కార్చదు.

నాకు మాటలాడ నిష్టము లేదు. నా హృదయము మూకత్వము చేత భారముగా ఉన్నది. ఆ భారము మాటలుగా ప్రవహిస్తూ ఉన్నకొలదీ హృదయము చులకనవుతుంది.

జిందగీ ఆ జగపటే, బాజీ ఛే అసమాన ఏ,
శక్తిసంగే ఖేలి ఏ, అణ దీఠనే బళవాన జే;
మోహాథీ నిజ మానిఆ శోగటా జే ఆపణీ,
శక్తితే మన ధాలియా హా! లే హారి చీ భీక్షణీ.

ప్రపంచమనే చదరంగపు పలకమీద జీవితమనేది బలవంతులైన ఎదిరి వారితోడి ఆట. ఆ ఆటను బలవంతమైన దృగ్గోచరము కాని ఒక శక్తితో ఆడవలసి ఉన్నది. మూఢులమై స్వగటాలు మనవే అనుకొంటాము. కాని ఆశక్తి వాటిని తన ఇష్టము వచ్చినట్లు చంపివేస్తుంది. వాటిని రక్షించడానికి మనము క్రొత్తక్రొత్త ఎత్తులు వేస్తు ఉంటాము. కాని ఆశక్తి మన ఎత్తులను వ్యర్థము చేస్తుంది.

ఓ ఘడి నవ ద్వార ఏ; పాయ ముజ నీచే సరే
క్యా కళుభు కళణమా? ముజనే ఖబర క ఇ నవ పడే
ధర్మబళ! ముజబంధు ఓ! దివ్యశ్రద్ధా! మాత ఓ!
కళణ కర్దమ మాబతో కో రోకజో ధరీ హాథ ఓ

తలుపు తెరువదు. నా అడుగులు క్రుంగిపోతున్నవి, బురదలో దిగబడుతున్నానా. నాకు తెలియదు. ధర్మబలము. తమ్ముడా! దివ్యశ్రద్ధ! తల్లీ యింకా క్రిందికి దిగబడుతున్నాను. చేయూతఈ. ఈ ఊబిలో దిగబడకుండా నన్ను రక్షించు.

మంగలమందిర ఖోలో, దయామయ! మంగలమందిర
ఖోలో !

జీవనవన అతి వేగే వటావ్యు, ద్వార ఉభో శిశుభోళో,
తిమిర గయు నే జ్యోతి ప్రకాశ్యో, శిశు నే ఉరమాలో
ల్యో; దయామయ మంగలమందిర ఖోలో
నామ మధురతము రట్యో నిరంతర, శిశు సహ ప్రేమే
ఖోలో
దివ్య తృషాభర ఆవ్యో బాలక ప్రేమ—అమీరస
ఢోళో; దయామయ మంగలమందిర ఖోలో

నీ మంగళమందిరమును తెరువుము. దయామయా మంగళ మందిరమును తెరువుము. నే నీ జీవితారణ్యమును అతి శీఘ్రముగ దాటితిని. నేను శిశువునైనా నీ ద్వారము వద్దకు వచ్చి నిలిచినాను. ఇక చీకటిలేదు. నా ముందర జ్యోతి వెలుగుచున్నది. ఈ శిశువును నీ హృదయము వద్దకు చేర్చుకో. దయామయా నీ మంగల మందిరమును తెరువుము.

నీ మధుర నామమును నిరంతరమునూ జపించినాను. ఈ నీ శిశువుతో ప్రేమతో మాట్లాడు. నీ శిశు విప్పు డిక్కడనే ఉన్నాడు. నీ దివ్యత్వముకోసము దప్పి కొన్నాడు. అతని మీద నీ ప్రేమామృత రసమును కురిపించు. దయామయా నీ మంగళ మందిరమును తెరువుము.

మఱి ఒక్కటి:—

కాళా ఘనే ఉజ్జ్వల సూర్యబింబ
ఢంకాయు,— తే చిత్ర దీసే అగమ్య,

త థాపి కాళీ ఘన ఛాయ ఫ్రూతే,
జ్యోతి రపో్య ఝళ హళీ న ఖదీ యఖూతే,
మృత్యు తణీ శ్యామల ఛాయ ఢాంకే,
అనంత తామా క్షణ భంగ దాఖే;
త థాపి ఏ ఛాయనీ పేలీ పారే,
దేదీప్యమాన చిరజీవన సింధుమ్హాలే
అనంత ఆ జీవన సింధు మధ్య
మృత్యువనే బుద్బుద, తేహ సద్య
జా ఏ ఫూటీ జో! క ఇ వార వారే
నే సింధు తో వ హీ రహీ అవిరామ ధారే.

ఉజ్జ్వల సూర్యబింబము కాలమేఘముచేత ఆచ్ఛాదితమైనది. అది అగమ్యమైన చిత్రము. ఐనా ఆ మేఘ ఛాయ వెనుక ఆ దివ్యజ్యోతి అట్లే శాశ్వతప్రభతో వెలుగుతున్నది. అట్లే మృత్యువనే శ్యామలచ్ఛాయ అనంతకాలమునకు ఒక్క క్షణముమాత్రము భేదించుచున్నది. ఆఛాయ అనంతరము అనంత జీవమనే మహాసముద్రము ప్రవహిస్తున్నది. జీవన ప్రవాహములో మృత్యువొక బుద్బుదము. మళ్ళీమళ్ళీ ఆ బుడగ పగిలిపోతుంది. కాని సముద్రి మెడ తెగకుండా నిలుస్తుంది.

మణిశంకర రత్నాజీభట్టు (1867—1923) గొప్ప గుజరాతీ గ్రంథకర్త. ఇత డనేక విధములైన గ్రంథములను వ్రాసినాడు. కాని, ఈతడు కవిగామాత్రము ప్రఖ్యాతి కెక్కినాడు. ఇతని వసంతవిజయము, చక్రవాక మిధునము అనే

ఖండకావ్యములు నూతన గుజరాతీకావ్య విలాసమునకు చక్కని ఉదాహరణములు. గుజరాతీ ఖండకావ్యములను వ్రాసిన పార్సీ కవులుకూడా అనేకులున్నారు. వీరిలో అర్దేషిర్ ఫ్రాంజి ఖబర్దారు అనేక కావ్యములను రచించినాడు. వాటిలో 'కలిక' అనే కావ్యము అందముగా ఉంటుంది. ఇందులో కథలేదు. ఒక్కొక పద్యములో ఒక్కొక చక్కని భావపుష్ప ముంటుంది. కావ్యమొక పెద్ద పుష్ప గుచ్ఛము. దానిలోనుండి రెండు పువ్వులు మాత్రము—

"తళావనే తీరే జోడ ఆబలా ఛే జాఝా ఝూకీ,
డాళీమా ఛే డాళీ త్యా ఏ బనేసి గుంథా ఈ,
నీచే రహ్యా జళమా తే వాయు ప్రేర్యా ఝూలీ ఝూలీ
జోయ నిజఛాయా రూడీ రహీ ఝూల ఖా ఈ;
తళావనే తీరే ఏమ గుంథీ కరతాళఓ త్యా
ఏకదిన ప్రియా ఊభీ రహీ శే మారీ నాథ,
ఝూకీ ఝూకీ జోఈ త్యారే ఊండా జళదర్పణమా
గాల పరగాల అనే హాథమా సీ హాథ;
తళావనే తీరే, ప్రియా, జ్యారే కరదాళ ఓనే
గుంథీ రహేశు ఆపణే త్యా జోతా ఏక మేక;
ప్రతిఛాయా బేవడీ త్యా జోఈశు జళదర్పణమా,
జాళే జూడా దేహా సరీ గయా ఊండా ఛేక
అధరే అధర, నేళే నేణ రహీ గుంథారీ త్యారే
దేహాతణు ద్వైత జోతజోతమా హు ఖోఈ
ప్రియా, మారీ ఆఖమా త్యా జోయ మాత్ర తనేజతు
అనే తారీ ఆఖేహు సమా యామనే జోఈ.

ఒక సరస్సు ఒడ్డున రెండు రసాలము లున్నవి. అవి తమ శాఖలను పెనవేసుకొన్నవి. వాయుప్రేరితములై, అవి రెండును కలిసి క్రిందికి వంగి నీటిలో తమ నీడలను చూచు కొంటున్నవి. అట్లే నా ప్రియురా లొకనాడు నా చేతితో తన చేతిని పెనవేసుకొని నా ప్రక్క నిలువగలదు. అప్పుడు మే మున్ను అద్దమువంటి నీటిమీదికి వంగివంగి, చెక్కిలికిచెక్కిలి చేతిని చేయిచేర్చి మా నీడలను చూచుకొంటాము.

ప్రియా, మనమట్లు బుగ్గమీద బుగ్గచేర్చి, చేతిని చేతికి పెనవేసుకొని చూచేటప్పుడు మనకు కనబడేవి రెండు దేహ ములు కావు. ఒక్కటే కనబడుతుంది; ఒక్కటే నీడ రెం డింతలుగా గోచరిస్తుంది. పెదవికి పెదవిని బంధించి, కంటిలో కంటినిచేర్చి, నే నిప్పు డున్నవాడనుగా ఉండను. ప్రియా, నా కన్నులలో నిన్ను చూస్తావు. నీ కన్నులలో నన్ను చూచు కొంటాను.

"జాఓ మారా గీత, బధు మధురు మధురు లాగ్యా,
హాతు గఈ కాలే తే, శో తేనో అఫసోస ?
మధురు జే లాగ్యా తే తో ప్రభు ఎ దీదేల హాతు
అధురు జే దీసే త్రేమా హా శే దృష్టిదోష;
లాఖోలాఖ దుఃఖో ఏ జే మంథన హైయానా మాండ
యా
తేనీ కటుతాఏ ఆవ్యా అమృతనా ఓఘ;
కటుతా సారహో మారీ; మధురతాహోత మారీ;
జాఓ, మారా గీత, ఆవో ఆనంద అమోఘ."

నా గీతమా, వెడలిపో. నిన్నటి మాధుర్యముకోసము నే వెందుకేడుస్తావు. సంపూర్ణమైనదంతా ఈశ్వర ప్రసాదమే. నాకంటికి కనబడని దానిని నేను కూడబెట్ట లేకపోయినాను. నా వ్యథిత హృదయమును మధించిన కొలదీ అమృత ప్రవాహము బయలుదేరినది. వ్యథ నా కుండిపోనీ, ఆ అమృత మాధుర్యమును నీవు తీసుకో. వెడలిపో నా గీతమా. లోక మునకూ అమోఘానంద ప్రసాదినివికా.

బలవంతరాయి కల్యాణరాయి ఠాకూరు మరొక గొప్ప ఆధునిక గుజరాతీ కవి. ఇత డనేక కావ్యములను వ్యాసములను వ్రాసినాడు. గుజరాతీ కవిత్వమును రోకటి పాటగా పరిణమింపజేసిన అనుప్రాస శృంఖలములనుండి తప్పించినాడు. ఇతని కవిత్వము భావగర్భితము. ఇతని ఖండ గీతికలను చదువుతూన్నకొద్దీ కొత్త సొగసులు బయలు దేరుతవి.

> ప్రణయ ఉభరే ప్రేమో ధుంధుం ఝూలీ శకణార నే,
> ప్రణయ పరస్పే ఢేలో జాచు పిలావన హార నే
> బహు తరవరే మనుజాకారో జు ఓ ద్రుగ జాయ జ్యా
> పణ హృదయనే ధారే ఏ ఉ క పో మళ ఉ క్యహా

“ప్రేమగట్లను తెంపి ఆ ప్రవాహమును ఎవరు గ్రి హింపగలరా అని వెదకుతూ సంచరిస్తాను. పిచ్చి ఎత్తించు చున్న దప్పికతో బాధపడుతూ నా కెవరు నీటి నిస్తారా అని తపిస్తాను. ఎక్కడచూచినా తన్నులాడుకొంటూ ఉండే

మానవ రూపాలే కనబడుతున్నవి. ఆహా నాహృదయమును భరించగల వ్యక్తి నా కెక్కడ దొరుకుతాడు."

ధార్యతు జే ప్రహరార్థ మతే.........
శాంత పడి సంధ్యా ఫడి ఖిలశే, నే కోకిల గాశే
ధార్యతు ఘాయల ఘా శమశే,
ప్లైన దొహ్యా లా తరీ ఉతరసే
నే కోకిల విగతజ్వర మహారో' జోశే సుఖ ఆరో
ధార్యతు సౌ ధూళ మళ్యు తే !
అట్టహాస్య ప్రలయో భభుకుల్యే తే
అవళచండ బేహాయా దైవను అపకృత దిలపోణు.

నీవ స్తమించిన గడియలో శాంతి వస్తుందనుకున్నాను. ఒక్క క్షణమైనా సరే సంధ్య నవ్వుతుందనుకున్నాను. కోకిల పాడుతుందనుకున్నాను. గాయము పడినవారి గాయములు మాసిపోత వనుకున్నాను. నా ప్రియ కోకిల భయంకరమైన ప్రవాహము నీది విగతజ్వరయై సుఖముగా గట్టుమీద వ్రాలుతుందనుకున్నాను. కాని నా కోరిక నెరవేరలేదు. మిగిలిన దంతా క్రూరవిధి చేస్తూఉన్న అట్టహాసము మాత్రము గర్జిస్తూ, జ్వలిస్తూ సర్వనాశనము చేస్తూఉన్న అట్టహాసము మాత్రము.

నవ కవులలో నానాలాలు (జననము 1877) ఉన్నత స్థానము నలంకరిస్తున్నాడు. ఇతని గరబీలు, గీతికలు, ఖండ కావ్యములు, నాటకములు, నవలలు, వ్యాసములు, ఇతిహాస

ములు, జీవిత చరిత్రలు, అన్నీ గుజరాతీ వాఙ్మయమున కలంకార ప్రాయములుగ ఉన్నవి. కావ్యరీతిలో ఇతడు క్రొత్త మార్గమును సృష్టిజేసినాడు. పూర్వకాలపు గరబీలకు క్రొత్త అందమును దిద్దినాడు. ఇతని కవిత్వమునుంచి కొన్ని ఉదాహరణములు:—

గోరస శే ఈ పీజో
హో! హీం! గోపి కాశీ గోరసీ భ రే లీ
వదనే ఛే హీంమ జ్యోతీ!
నయనేఛే ప్రేమ జ్యోతీ
ఆత్మామా అమృత నీహేలీ
హో! గోపికాశీ గోరసీ భరేలీ
హృదయానీ ఆశ ఏక,
రసియానా రాస ఏక,
ప్రేమీనీ ప్యాసనా ఛీపేలీ,
హో! గోపి కాశీ గోరసీ భరేలీ.

తీసికొనండి. పాలు త్రాగండి. ఓహో! గోపిక పాల కుండ అంచులవరకూ నిండి ఉన్నది.

ఆమె మొగముమీద హేమజ్యోతి ఉన్నది. ఆమె కన్నులలో ప్రేమజ్యోతి ఉన్నది. ఆమె హృదయములో అమృత ప్రవాహమున్నది. ఓహో! గోపిక పాలకుండ అంచుల వరకూ నిండియున్నది. హృదయమున కొకటే ఆశ. ప్రేమికి

ఒక్కటే నృత్యము. ప్రేమతృష్ణ తీర్చరానిది. ఓహో! గోపిక పాలకుండ నిండి తొణుకుతున్నది.

ఫూాభశో మా, కో ఇ ఫూాఛశో మా,
మారా హైయానీ వాత డీ ఫూాభశోమా
దిలనా దరియావ మంహీ కాఇ మోతీ,
గోతీ గోతీనే తేనీ చూంథశోమా,
మారా హైయానీ వాతడీ ఫూాఛశోమా
టహాకే భీ కోకిలా పుకారేఛే పపయ్యో,
కారణోన కామీనే సూభశోమా,

మారాహై యానీ వాతడి ఫూాఛశోమా
ఆసునా నీరనా కో ఆశాన్నా అక్షరో
ఆఛా ఆఛా తోయ లూఛశోమా,
మారాహైయానీ వాతడీఫూాఛశోమా
జగసా జోద్ధా! ఏక ఆటలు సుళీ జజో,
ప్రారబ్ధనా పూర సామే ఝూఝశోమా,
మారాహైనీ వాతడీ ఫూాభశోమా.

"నన్నడుగవద్దు, దయచేసి నా హృదయములో దాచుకొన్న రహస్యముల నడుగవద్దు. నా హృదయసముద్రములో ముత్యములు, ఆణిముత్యము లున్నవి. దయచేసి వాటికోసము వెదుకవద్దు. వాటి నెవ్వరున్నూ చెదరగొట్టవద్దు. నా హృదయములో దాచుకొన్న రహస్యముల నెవ్వరును అడుగవద్దు.

కోకిల పాడుతున్నది. గోరువంక పిలుస్తున్నది. కారణములకోసము వెదకులాడేవారు వాటికి కారణములు అడుగవద్దు. ఎవ్వరున్నూ నన్నడుగవద్దు. హృదయాంతరమునందు కన్నీళ్ళతో ఆశావర్గములు లిఖింపబడియున్నవి. అవి అంత స్పష్టముగా లేవు. దయచేసి వాటిని తుడిచివేయవద్దు. నా హృదయములో దాచుకొన్న రహస్యముల నెవ్వరున్నూ అడుగవద్దు. జగత్తు ఆరాధిస్తూఉన్న నా యోధుడా! చెవియొగ్గి వినుము. విధి వదలిపెట్టిన ఆ ప్రవాహమునకు ఎదురీత ఈదవద్దు. నా హృదయ రహస్యముల నెవ్వరున్నూ అడుగవద్దు."

---

# అష్టమాధ్యాయము

## నవయుగ వాఙ్మయము—సశేషము

గాంధీ మహాత్ముని రచనలు వాఙ్మయముగా ఉద్దేశింపబడని అతిసుందరమైన సారస్వతముగా పరిణమించినది. కవులు రెండువిధములుగా ఉంటారు. ఒకరు తమ అనుభవములను యథానుభూతముగా చిత్రిస్తారు. మఱియొక తెగవారు ఆ అనుభూతిని తమలో ఆరోపించుకొని ప్రయత్నపూర్వకముగా నాశము చేస్తారు. జీవిత అనుభవమునకున్నూ, కవిత్వమునకున్నూ సంబంధముంటే గాంధిమహాత్ముని జీవితము నొక పెద్ద కావ్యముగా పరిగణింపవచ్చును. అతడు పలికిన ప్రతి పలుకులోనూ అగాధమైన, జీవిత సముద్ర అంతరములనుండి ఒక దివ్య ఘోషము బయలుదేరుతుంది. మనో వాక్కర్మల కతని జీవితములో అవినాభావ సంబంధమున్నది.

గాంధీమహాత్ముని జీవితమును గురించి తెలియనివారు భారతవర్షములో లేరు. కాబట్టి ఉత్తమ కావ్య ఖండములుగా పరిగణింపదగిన అతని భాషితములనుండి కొన్ని ఉదాహరణములిస్తే అతని జీవితరహస్యము ప్రస్ఫుటమవుతుంది. కర్మవీరుని వీరవాక్కులు, అచలధీరుని అమృతవాక్కులు, ప్రేమపిపాసి ప్రియతమవాక్కులు అతని గంభీర హృదయమునుంచి వెడలి, గుజరాతీ వాఙ్మయక్షేత్రమును ముంచెత్తివేస్తున్నవి. అతని రచనల మూలముగా గుజరాతీ భాషయేగాక సమస్త

భారత వక్షీయభాషలునూ, క్రొత్తపోకడలను నేర్చుకొన్నవి. సుస్పష్టముగా జ్వలిస్తూఉన్న భావరత్నము, భావరత్నములు ఒకదానికొకటి చేరి ఏర్పడిన హారము, ఆహారము లొకదాని కొకటి చేర్పబడి ఏర్పడిన సరులగుత్తులు భారతమాతకు నేడు కంఠాభరణములుగా వెలసినవి. అతని భావములు బాణముల వలె అతి సునిశితములు. అతని హృదయమునుంచి వెడలి ఎదుటి హృదయమును దూసికొని పోవునట్టివి. అతని వాక్కులు అమృతపు సోనలు. వీనులకు విందుచేసి, హృదయములపై వెల్లివిరియించి, ఆ వెల్లువలో తేలియాడించు నట్టివి. ప్రయోజనములేని వాక్కు అతని నోటినుండి వెడలదు. ఫలవంతముకాని భావము అతని హృదయములో ఉత్పత్తి కాలేదు. అతడు ప్రయోగించేది రామబాణము. చేసేది సుగ్రీవాజ్ఞ. కోరేది రామరాజ్యము. ఆ రామరాజ్య సంస్థాపనమునకు గాంధీజీ తన జీవితమును ధారపోసినాడు. పడరాని కష్టములు పడినాడు. భరించరాని వేదనలను భరించినాడు. అతడు తపశ్శాలి. విశ్వప్రేమి. అతని వాక్కులను కొన్నిటిని విని తరించుదాము.

## ప్రబోధము

రాగోరినవారు రావచ్చును. శక్తిగలవారు పోరాటములో చేరవచ్చును. ఈ ఆహ్వాన మందరికిన్నీ ఉద్దేశింపబడినది. కాని ఆకలి గలవారికే ఈ విందు. ఇతరులువచ్చి చేరినా తర్వాత విచారించగలరు. ఆకలి లేనివానికి మిఠాయికూడా రుచించదు. ఆకలిగలవానికి గంజినీళ్ళయినా అమృతప్రాయ

మవుతుంది. అట్టీ సహాయ నిరాకరణమునుగురించి బోధ పరచుకొన్నవారే ఈ పోరాటములో నిలువగలరు. బోధ పరచుకొన్నవారి కన్నికార్యములున్నా సులభమవుతావి. బోధ పడనివారికి అన్నీ కష్టములే. గ్రుడ్డివానిచేతి కద్దమిచ్చి ఏమిలాభము.

కష్టకాలము వచ్చినది. అవిచారితముగా ఒక్క అడుగు ముందుకు వేసినా కష్టముల పాలవుతాము. శాసననిరోధమూ, దానినిగూర్చి మనకు తెలిసినదే ఉన్నది. అది కారాగారము నకు దారి చూపుతుంది. దానిని మన మాహ్వానింపగలము. అనేకు లక్కడకుపోయినారు. కష్టము లనుభవించినారు. తిరిగి వచ్చినారు. మనముమాత్ర మాపాటి చేయలేమా. అది అంత కష్టమైనదికాదు. కాని—?

కాని, సైనిక శాసనమును ప్రకటిస్తే? గూర్ఖాలువస్తే? టామీ ఆక్టింగ్సుదొరవస్తే ? మనలను తుపాకి కొనలకు గ్రుచ్చిన కత్తులతో పొడిస్తే? గుండ్లు వేలిస్తే? నేలమీద ప్రాక మని చెపితే? పరమ సంతోషము. రానివ్వండి. కాని, మన లను కడుపులమీద ప్రాకమంటే? అప్పుడుకూడా చావడ మునకు సిధపడవలె కాని, ప్రాకకూడదు. చస్తామా? ప్లేగు చేత చచ్చేది, కత్తిపోటుతో చస్తాము. మనమీద తుపాకులు వేలిస్తే వీపులుచూపి పారిపోమనుకుంటాను. తుపాకిగుండ్లకు ఆట వస్తువులకువలె మన గుండెలను చూపగలిగేశక్తిని మనము సంపాదించుకొన్నాము. గూర్ఖాలను మన సోదరు లుగా మార్చివేతాము. మార్చలేకపోతే మన సోదరునిచేత

చావడముకంటె మనకు సౌఖ్యమేముంది. ఇట్లంటూ ఉండ గానే మనకు గర్వము కలుగుతున్నది.

కాని,——

ఈసారి పిరికితనమునకు పేరుబడిన గుజరాతము తన చేవను చూపగలదని నాకు నమ్మకమున్నది. కాని నేనిట్లా వ్రాస్తూఉండగే నా కలము బరువెక్కుతున్నది. గుజరాత మెప్పుడైనా తుపాకీగుండ్ల శబ్దమును విన్నదా? అది రక్తవాహి నుల నెప్పుడు చూచినది. పటాకీలవలె గుండ్లను పేలుస్తూ ఉంటే, గుజరాతము ధైర్యముగా నిలువగలదా? తలలు మట్టి కుండలవలె పగులుతూ ఉంటే చూచి తాళగలదా? ఇతర ప్రాంతములలో ఇతరుల తలలు పగులుతూ ఉంటే గుజ రాతీలు ఆ ఖ్యాతి తమదనుకుంటున్నారు, తమ తల లేపగి తే గుజరాతము అమరత్వమును బొందుతుంది. మీకు శిక్షణము కావలెనంటారా? శిక్షణ మేల. ఆత్మవిశ్వాసము కావలె నంటారా? కాంగ్రెసు ఒక తీర్మానము చేసినంత మాత్రాన ఆత్మవిశ్వాసము రాదు. దిక్కు లేనివారికి దేవుడే దిక్కు. అతడే ధైర్యము నిస్తాడు! మనకు శ్రీరామరక్ష. మన కెవ్వరునూ హానిచేయలేరు. ఈ దేహమును మనకు ప్రసాదించినవా డాతడే. అతనికి కావలిస్తే దానిని తీసికో నివ్వండి. మీరు కోరినంతమాత్రము ఈ శరీరము నశించకుండా దాచుకోగలరా? ధనమునువలె దానిని ఉత్తమకార్యముల కోసము వినియోగించవలెను. ఈ ఘోరకృత్యమును ఎదు ర్కొనడానికి కాకపోతే ఈ ప్రాణము నర్పించడానికి

మనకు త్తమ సమయ మెప్పుడు దొరుకుతుంది. ఈ రీతిగా దీనినిమనసార ఎవ్వరు నమ్మెతారో వారు మందహాసము చేస్తూ తమ గుండెలను తుపాకిగుండ్లకు గురిగా చేయగలరు.

మరొక సమయమున;—

"మన కష్టములు హిమవత్పర్వతములవలె తరింప శక్యముకానివి. ఆకష్టము లెంతగొప్పవైనా వాటిని తరించే ఉపాయములుకూడా అంత గొప్పవి మనవద్ద ఉన్నవి. మనది సనాతన సంతతి. మన కన్నులయెదుట రోము, గ్రీసు, ఈజిప్టుల, సామ్రాజ్యములు చీలములై పోయినవి. మన నాగరికతకు సముద్రమునకువలె ఆటు పోటులు కలుగుతున్నవి. కాని సముద్రమువలెనే అది మార్పులేక నిలిచినది. జీవితమునుసర్వ సంపూర్ణముగా చేయగల సమస్త సదుపాయములునూ మన దేశములో నున్నవి. మనకున్నతపర్వతము లున్నవి. విశాల ములైన నదులున్నవి. ప్రకృతి సౌందర్య మమితముగానున్నది. భారతపుత్రులు తాముచేసిన ఘనకార్య ధనమును మనకు వదలిపెట్టి పోయినారు. ఈదేశము తపస్వులుచేసిన తపస్సు నకు భాండారము. ఇచట అన్నిమతములవారునూ కలసిమెలసి ఉన్నారు. ఈ దేశములో మాత్రమే సమస్త మతములవారి దైవములకునూ పూజ్యత ఉన్నది. ఇట్టి సదుపాయములుంచు కొని ఒక అసాధారణమార్గమును ప్రపంచమునకు శాంతి పాఠమును నేర్పలేకపోతే, మన సాత్త్విక వ్యాపారముతో ఆంగ్లేయులను గెలువలేకపోతే, మన పూర్వులు మనకు వదలి పెట్టిన విజ్ఞానము నవమానించినవార మవుతాము. అప్పుడు

మన కాంగ్లేయులతో కలిగిన సంబంధము వృధా అవుతుంది. ఆంగ్లేయులు సాహసికులు. వారు దైవభక్తిపరులు. ఆత్మ విశ్వాసము కలవారు. వీరులజాతికి జెందినవారు. వారు స్వాతంత్ర్యముకోసము పనిచేస్తారు. కాని వారిలో వాణిజ్య దృష్టి అధికముగా ఉన్నది. ధన సంపాదనమునకున్నూ, నీతి కిన్నీగల సంబంధమునుగురించి వారెప్పుడున్నూ తలంచ లేదు. వారి కాధునిక నాగరికతయే పరదైవము. పూర్వ కాలపు ఉన్నతాశయములను వారు మరచియున్నారు. వారిని మన మనుకరింప నక్కరలేదు. మన ఆశయములను మనము మరువకుంటే, మన సంస్కృతిని మనము ప్రేమిస్తే, మన సంస్కృతి అత్యుత్తమమైనదని మనము దృఢముగా విశ్వసిస్తే వారితో మనకుగల సంబంధములను మన కుపయోగపడునట్లు చేసికొని, వారి శ్రేయస్సుకే కాక, ప్రపంచ శ్రేయఃప్రాప్తికి గూడ మనము తోడ్పడగలము.

ఈశ్వరుడు

సత్య మొకట్లే ప్రపంచములో ఉన్నది. అందుచేతనే ఈశ్వరుని సత్తుగా నిరూపిస్తారు. నాకు సత్యమే పరతత్త్వము. తక్కిన అన్నితత్త్వములున్నూ దానిలో ఇమిడియున్నవి. ఈ సత్యము వాగ్రూపమైనది మాత్రము కాదు. మనోరూప మైనది కూడను. అది తారతమ్యములకు లోబడిన సత్యము కాదు. తమతమ భావాతీతమైన సత్యము. అదే శాశ్వత తత్త్వము. అదే ఈశ్వరుడు.

## సత్యాగ్రహము

సత్యాగ్రహమంటే ప్రేమ. దానిని ఆకర్షణ మనండి, సంబంధ మనండి, పరస్పర సమ్మేళన మనండి. ఆ ప్రేమ సూత్రము చేతనే ప్రపంచము బద్ధమై యున్నది. మృతిననుస రించియే జీవితమున్నది. నిత్య వినాశియై విశ్వమల్లే అవినాశిగా ఉంటుంది. సత్య మసత్యమును జయిస్తుంది. ప్రేమ ద్వేష మును జయిస్తుంది. ఈశ్వరుడు సైతానును జయించి తీరు తాడు. సత్యాగ్రహికి తనది అని చెప్పగల శక్తి ఒకటియూ లేదు. తనకున్నదని అనుకుంటూ ఉన్న శక్తి అంతా ఈశ్వరునిదే.

## ప్రకృతి వర్ణనము

[బ్రహ్మపుత్రానదిమీద ఓడలో పోతున్నప్పుడు.]

ఓడ నదిమీద ప్రాకిపోతున్నది. మేమందరమున్నూ పట్టుమీద కూర్చున్నాము. నది సముద్రమువలె విశాలముగా కనబడుతున్నది. దూరముగా రెండుప్రక్కలనూ గట్లు గోచ రిస్తున్నవి. ఆ రెండుగట్లకునూ రెండు మైళ్ళ ఎడముండవచ్చును మేము నదిమీద 15 దినములు ప్రయాణము చేయవలెను. నదిమీదికి అనిర్వచనీయమైన శాంతి అవతరించినది. మేఘ ముల వెనుకనుండి తొంగిచూస్తూ చంద్రుడు జలములమీద మెత్తని చంద్రికలను ప్రసరింపజేస్తున్నాడు. ఓడను నడిపే యంత్రములు నీటిలో తమ దారిని చేసుకొంటూ మధుర గానము చేస్తున్నవి. ఈ గానము తప్ప అన్నివస్తువుల

మీాదనూ, అన్నిచోట్లనూ శాంతి వ్యాపించినది. మనశ్శాంతి లేనివాడను నేనొక్కడనే. ఆ ఓడ నాదికాదు. ఆ నది నాదికాదు. నా భారతవర్షమును బలహీనముగా తేజోహీనముగా ధనహీనముగాచేసిన ఆ ప్రభుత్వమువారి దయవల్ల నేనీ ప్రయాణమును చేయగలుగు తున్నాను.

[ఈ క్రింది జాబులో మహాత్మునికి చిన్నపిల్లలమీాదగల ప్రేమ వ్యక్తమవుతుంది. దాని నతడు ఎఱ్ఱవాడ చెరసాల నుంచి శబర్మతీ ఆశ్రమములోని బాల బాలికలకు వ్రాసినాడు.]

"పక్షులు సాధారణముగా రెక్కలు లేకుండా ఎగురలేవు. రెక్కలుంటే అందరున్నూ ఎగరగలరు. కాని రెక్కలు లేకుండానే మీారు ఎగరడము నేర్చుకుంటే మీా కష్టములన్నీ గట్టెక్కుతవి. నేను నేర్పుతాను వినండి.

చూచినారా! నాకు రెక్కలు లేవు. ఐనా నా తలపులతో నేను ప్రతిదినమున్నూ మీా వద్దకు ఎగురుకొని వస్తూ ఉంటాను. ఇదిగో ఇక్కడ చిట్టి విమల ఉంది. ఇక్కడ హరి ఉన్నాడు. ఇక్కడ ధర్మకుమారు డున్నాడు. మీారుకూడా మీా తలపులతో నావద్దకు ఎగిరి రావచ్చు.

స్వయముగా ఆలోచించుకొన గలిగినవారికి వేరే గురువుండ నక్కరలేదు. గురువు మనకు దారి చూపెట్ట గలడు గాని, ఆలోచించే శక్తి నివ్వలేడు. ఆశక్తి మనలోనే ఉంది. బుద్ధిమంతులైన వారికి మంచితలపులు కలుగుతవి.

ప్రభూభాయి సాయంకాల ప్రార్థనలలో మీలో ఎవ్వరు సరిగా ప్రార్థన చేయకుండా ఉన్నారో నాకు చెప్పండి.

అందరున్నూ సంతకములు పెట్టి నా కొక జాబు వ్రాయండి. సంతకము పెట్టడము రానివాండ్లు ఒక కత్తెర గుర్తు వేయండి.

ఎఱ్ఱవాడ రాజమహలు,
మౌనదినము. బాపూజీ ఆశీర్వచనములు.

ఈ ఆశీర్వచనములతో మహాత్ముని వాఙ్మయ సేవను గూర్చిన వృత్తాంతమును ముగించుదాము. ఇంకనూ ఇటువంటి వాఙ్మయ మాతని లేఖినినుండి బయలుదేర జేసేటట్లు సర్వేశ్వరుని ప్రార్థిద్దాము.

గాంధిమహాత్ముని అడుగు జాడలలో క్రొత్త రీతి వాఙ్మయ సృష్టిని గుజరాతీ భాషలో చేస్తూ ఉన్నవారిలో కాకా కవేల్కరు అని పిలువబడే దత్తాత్రేయ బాలకృష్ణ కవేల్కరు ఒకడు. ఈతడు మహారాష్ట్రుడయినా తన మాతృ మండలముగా గ్రహించిన గుజరాతు రాష్ట్రభాషలో చక్కగా వ్రాయనేర్చి అనేక గ్రంథములను రచించినాడు. వాటి అన్నిటిలోను స్వానుభవములను అతి గంభీరార్థ సహితములగు చక్కని చిన్నిమాటలతో చెప్పినాడు. గాంధిమహాత్ముని మీద ఈతనికిగల భక్తి నిరుపమానము. వినండి—

"ఇప్పుడు పోరాట మంతరించగలదు. ద్వేష మదృశ్యము కాగలదు. ఆధ్యాత్మిక మహత్త్వము జయించగలదు.

గాంధిమహాత్ముడు ప్రపంచమునకు నూతన సందేశము నీయ వచ్చిన గురుమహారాజా, లేక అట్టిగురువు రాకను ప్రకటించే సందేశహరుడా, అట్టి గురుభాస్కరోదయమును సూచించే వేగుజుక్కా? నాకు తెలియదు. తెలుసుకొనడానికి కూడా నాకిష్టములేదు. రాత్రి అంతరించినది, ఎల్లెడలను వెలుతు రావరించినది. విశ్వాసపరుల కిది చాలును. గాంధిమహాత్ముని మహావీరునితో, బుద్ధునితో, శ్రీకృష్ణునితో సాటిచేయను. కాని, ఆతడు తెలిపిన సందేశము జైన, బౌద్ధ, భాగవత ధర్మముల సారము. అందుచేత ఆమూడింటికంటె ఉత్కృష్టమయినది."

ఆధునిక గుజరాతీ వాఙ్మయము సర్వతోముఖముగా అద్భుతాభివృద్ధి పొందుతున్నది. ఆ వాఙ్మయ వాహిని వరదలలో ఉన్నది గట్లు తెగిపోతున్నవి. భావభారమును మోచుకొంటూ వాక్ప్రవాహము జీవనక్షేత్రములను ఫలవంతములుగా చేస్తున్నది. నేడు బయలుదేరుతూ ఉన్న కావ్యకర్తలలో అనేకులు ప్రతిభావంతు లున్నారు. వారిలో అనేకు లెడతెగకుండ సారస్వతసేవ చేస్తున్నారు. వారిలో కొంతమందితో మాత్రము పరిచయము చేయడానికి ఈ చిన్న గ్రంథములో స్థలము మిగిలినది.

కన్నయ్యాలాల్ మనేకలాల్ మున్షి (జననము 1887) నేడు బొంబాయి ప్రభుత్వ మంత్రివర్గములో ఒకడు. దేశసేవా పరాయణుడు, గాంధిమహాత్ముని నాయకత్వమున దేశస్వాతంత్ర్యముకొరకు మనేకకష్టముల ననుభవించినాడు? ఈతడు గుజ

రాతీ వాఙ్మయమునకు చేసిన, చేస్తూ ఉన్న, సేవ అమితము, అమోఘము. ఈతడు కృషి చేయని వాఙ్మయక్షేత్రము లేదు. ఫలవంతముకాని కృషి లేదు. 'వెరనివసూలత', 'కోక్రోవాంక', 'స్వప్నదృష్ట', 'స్నేహసంభ్రమ', మొదలయిన సాంఘిక, రాజకీయ జీవితమునకు సంబంధించిన ఆఖ్యాయికలను వ్రాసినాడు. 'పాటనానీప్రభుతా' 'గుజరాతనోనాథ', రాజాధిరాజ' 'పృథ్వీవల్లభ', 'భగవాన్ కౌటిల్య' మొదలయిన చారిత్రకాఖ్యాయికలను వ్రాసినాడు. 'పురందర పరాజయ', 'అవిభక్తాత్మ', 'తర్పణ', 'పుత్రసమోవతి', 'ధ్రువస్వామినీదేవి', 'లోపాముద్ర', 'విశ్వరథ' 'శంబరాఖ్యాన', 'దేవేదధేవీ', 'విశ్వామిత్రద్ర' మొదలయిన పౌరాణిక నాటకములను రచించినాడు. 'వవశేత్ను స్వాతంత్ర్య', 'బేఖరా బజనా', 'అజ్ఞాంకిత', కాకినీశశి'. 'బ్రహ్మచర్యాశ్రమ' మొదలయిన సాంఘిక నాటకములను వ్రాసినాడు. 'మారి కమ్లు అనే బీజివాతో' అనే ఈతడు రచించిన చిన్న కథలసంపుటము ప్రకటింపబడినది. 'కేత్లాక లేఖో' అనే రెండు సంపుటములలో ఈతని లేఖలు, వ్యాసములు, మొదలయినవి చేరిఉన్నవి. 'తోదాంక రసదర్శానో' అనే సంపుటములో 'కావ్యరీతి, రసము, సారస్వతకళ' మొదలయిన విషయములనుగురించిన వ్యాసములున్నవి. 'ఆదివచనో' అనే సంపుటములో 'గుజరాతిసాహిత్య సంపద్'నకు అధ్యక్షుడుగా ఉండి ఈతడు చేసిన ప్రసంగములు చేరినవి. 'శిసు అనే సఖి' అనేది గద్యములో వ్రాసిన పద్యకావ్యము, చాలా అందమయినది. 'నరసైయో భక్తహరినో'

'నర్మద్', అనేవి జీవితచరిత్రములు. 'అధధే రస్తే' అనేది స్వీయకథ. తన కావ్యముల ప్రత్యేక లక్షణములను గురించి మున్షి తానే ఇట్లు చెప్పుకొన్నాడు.

"గుజరాతీ కథా వాఙ్మయములోనికి మనోహరమైన కథ, నాటక సందర్భములు, సంభాషణము, సజీవపాత్రములు అనే లక్షణములను తెచ్చినాను. నే నెల్లప్పుడును కథకుడను మాత్రమే; నీతిబోధకోస మెన్నడును బుద్ధిపూర్వకముగా ప్రయత్నించ లేదు. ప్రపంచ విఖ్యాత కథకుడైన ఎలెగ్జాండరు డ్యూమాసును మొదటిలో లక్ష్యముగా ఉంచుకొని కథలు వ్రాసినాను. నా కథలలో బడి అయ్యవారల శిష్యులయిన మంచి పిల్లవాళ్ళను కాని, కళాకాంతులు లేని స్వాప్నికపాత్రములను గాని నేను చిత్రించ లేదు. నా పాత్రములందమునూ నిండు రక్త మాంసములతో కూడి ఉన్న స్త్రీ పురుషులై ప్రేమించగలరు, పోట్లాడగలరు, పాపము చేయగలరు. జీవితముతో నిరంతరముగా యుద్ధము చేయగలరు. జీవితమునకున్ను నీతికిన్ని సంబంధించిన సిద్ధాంతములను తెలుపడము నా ఉద్దేశ్యము కాదు. జీవిత రంగమును యథాస్థితముగా నిరూపించడమే నా ఆశయము.

చారిత్రక నవల అంటే మనోహర జీవితగాథ అని నా అభిప్రాయము. దానిని గురించి మరి ఒకరీతిగా తలంచడము నా చేతగాదు. కావ్య కళోపాసకుడు గత కాల వృత్తాంతమున్నదున్నట్లుగా చిత్రింపజాలడు. అతడు గతప్రపంచమును మరో ప్రపంచముగా, గత వ్యక్తులను పురాణపురుషులుగా

ఊహించి ఆనాటి పరిసరముల నీనాటి పరిస్థితుల మధ్యకు తేవలెను. లేదా తనచుట్టును జరుగుతూఉన్న జీవిత నాటక కథనే పురాతనరంగ యవనిక మీదికిపంపి చిత్రముల నాడించ గలడు. నాకు తెలిసినంత మట్టుకు కాళిదాసు, షేక్స్పియరు, స్కాటు, హ్యూగో, డ్యూమాసు మొదలయినవారు రెండో పద్ధతి నవలంబించినారు. నాకు సాధ్యమయినంతమట్టుకు నేనున్ను ఈపద్ధతి నే దృక్పథములో ఉంచుకొన్నాను. పౌరాణిక గాథను ఆధునిక జీవనముతో శ్రుతిచేసి ఆలపించినాను. ఆకాశమార్గము ననుసరిస్తూ ఉండిన కథావాఙ్మయము నైహికి గాథలతో సరిచేసినాను,

* * *

"నా గ్రంథము లనేకములలో ముఖ్యవిషయము ప్రేమ. అది ఒకరి చెవులలో ఒకరు గుసగుసలాడుకొనే ప్రేమకాదు. సాంప్రదాయమునకు కట్టుపడినది కాదు, తీయతీయగా కవులూహించే ప్రేమకాదు. ఆధునిక ప్రపంచములో నిరాఘాటముగా సంచరిస్తూ ఉన్న ప్రేమ అది. నీతి బోధకులనుగాని ధర్మోపదేశక ఋషులనుగాని, వృద్ధనారుల పాతివ్రత్యోపదేశములనుగాని లక్ష్యపెట్టే ప్రేమకాదది. దాని బలాబలములను, దాని బాధ, క్షోభము' విషాదములను, దాని సంపూర్ణాత్మార్పణము, పరానందములనుకూడా చిత్రించినాను. అట్టి చిత్రణములోనే కవిత్వమున్నది. అందులోనే దాని మహత్త్వమున్నది. అట్లు చేయడము వల్లనే అది తుచ్ఛత్వమునుంచి, అశ్లీలతనుంచి తప్పుకొనడాని కవకాశ మున్నది.

ఇట్లుచేసి గుజరాత వాఙ్మయ సంప్రదాయములను నతిక్రమించినానన్న నిందను పొల్పడినాను. కాని, నాకు జీవితము పవిత్రమైనది; జీవితమును బంధించడాని కేర్పడిన సూత్రములమీద నా కంతగా గురి లేదు.

కలా వాఙ్మయములనుగురించి మున్షి అభిప్రాయము:

"శక్తి, సౌందర్యములు గలిగిన ప్రాచీన వాఙ్మయమే సరియైన వాఙ్మయము. దానిలోని రహస్యమే కొద్దిమందికో బోధపడుతుంది. సంస్కృతి పొందిన కొద్దిమంది మాత్రమే దానిని చదివి అనందించగలరు.

సారస్వత కళోపాసకునికి విషయములనురచనారీతిని అవలంబించడములో సంపూర్ణ స్వేచ్ఛ ఉండవలెను. సంప్రదాయములు, ముఖ్యముగా నైతికమత సంప్రదాయములు కావ్యాత్మను చంపివేస్తవి. సౌందర్య మెంతవరకు ఆవిష్కరించినది అనేదే కావ్యకళకు పరీక్ష. ఈ సౌందర్యమునుంచే కావ్యసృష్టి అమరానందము నిస్తుంది. నైతిక వ్యవస్థకున్ను కావ్య ప్రయోజనమునకున్ను ఇదే ముఖ్య భేదము.

కావ్య విమర్శ ఆత్మైక విషయము, సృష్ట్యాత్మకము విమర్శకుని హృదయమునందు కావ్యానందమెట్లు ప్రతిఫలించినదో చెప్పడమే కావ్య విమర్శకుని పని."

జీవిత తత్త్వమును గురించి—

"తమ ఆత్మను శక్తినిగా మార్చుకొనడములోనే ఆర్యుల మహత్త్వమున్నది. తన వ్యక్తిత్వమునకు లక్షణమైన

ఏకభావమునందు వ్యక్తి లీనమవుతాడో అప్పుడు తేజోమయు డవుతాడు, శక్తిసంపన్ను డవుతాడు.........తానే శక్తి స్వరూపు డవుతాడు; దుర్ధర తేజశ్శాలి అవుతాడు.......

అట్లే ఇద్దరు కాముకులు ఏకరీతి భావనా ప్రేరితులై, ఆ ప్రత్యేక భావన లనేకము; అవిభాజ్యము, నిర్వికారము అయిన ఏకభావనగా సమ్మేళనము చేసుకొన్నప్పుడు వారికి లక్ష్యము ప్రాప్తిస్తుంది. ప్రేమ వారిజీవితమును సౌందర్య రూపముతో పరిపాలిస్తుంది...... ఈరీతిగా సౌందర్యమును మహత్త్వమును సంపాదించడానికి నేను నేనుగా నిలిచిపోవడము పనికిరాదు. నన్నతిక్రమించి నిన్నాక్రమించడమే దానికి కీలకము. 'భావన' అనేదానికి 'ఉండడము' అని అర్థముకాదు; 'కావడమే' భావన. ఎప్పుడు 'అవు'తానో అప్పుడే నా ఆనందము స్థాయిని పొందు తుంది. ప్రేమ, దైవభక్తి; కావ్య సౌందర్యము, మానవ మహత్త్వము; ఆత్మార్పణము, ఆత్మధర్మము, అనేవాటి మూలతత్త్వ మొక్కటే. జీవితములో వలెనే, కావ్యములో కూడా అంతకంతకున్న నూతనౌన్నత్య సహితులము 'కావడము' లోనే సౌందర్యము పరిస్ఫుట మవుతుంది."

ఇట్లున్నతులము 'కావడము' నైతికాధ్యాత్మిక విషయములో మాత్రమే అయి ఉండనక్కరలేదు.

"అస్వాధీనమయిన రోకటిపాట జీవితముకంటె అపాయములమధ్య ఉరకడమే యెక్కువ ప్రశంసా పాత్రమయినది. వ్యక్తులకున్నూ జాతులకున్నూ కూడా ఏకభావనా ప్రేరితులై, ఏక లక్ష్యాకృష్టులై, పోరాటము చేస్తూ, బాధపడుతూ, తప

స్వార్థ్యాగముల మూలముగా కార్యసిద్ధి కోసము ప్రయత్నమును విడువకుండడములోనే గొప్పతన మున్నది. ఈ ప్రయత్నము నకు సాధారణ మానవ మనోలక్షణములు చాలును; కాని, వాటికొక లక్ష్యమున కనుసంధించవలెను; ఆలక్ష్యము కోసము ప్రాణముల నర్పించడానికి సంసిద్ధతను సంపాదించవలెను. బలమును శక్తిని సంపాదించే రహస్య మిందులో ఉన్నది.

సంపూర్ణ జీవితములో బలమునకున్ను ఆశకున్ను చోటున్నది. అట్లే నవ్వు, కన్నీళ్ళు, గర్వము విషయానంద ములకుకూడా చోటున్నది. ప్రేమయే పరమధర్మము, సౌంద ర్యము పరమధర్మము. ఒకటి స్త్రీ పురుషుల అవిచ్ఛిన్నైక్యము లోను, రెండోది అనంతానందములోను సంపూర్ణత్వమును పొందుతవి."

మున్షీగారి భార్య లీలావతి (జననము 1899) భర్త జీవితములో ఎట్లో ఆయన వాఙ్మయజీవితములోకూడా అట్లే సహధర్మచారిణిగా ఉన్నది. ఈమెకూడా అనేక కావ్యములను రచించినది. అనేకరీతుల కావ్యములను రచించినది. ఈమె 1925 సం॥రము వరకు రచించిన గ్రంథములు 'రేఖాచిత్రి అనే బిజాలేఖో' అనే సంపుటములో చేర్పబడినవి. 'కుమారదేవి' అనేది చక్కని అయిదంకముల నాటకము. 1925 సం॥ రము నకు తరువాత ఈమె రచించిన కథలున్నూ నాటకములున్ను 'జీవనమాంధీ జడేలీ' అనే పేర రెండు సంపుటములుగా ప్రక టింపబడినవి. తక్కిన రచనలు 'వధురేఖాచిత్రో అనే బిజుబధు' అనే సంపుటములో చేర్పబడినవి.

లీలావతి భాషా శైలిలో గుజరాతీ గద్య మున్నత స్థానము నాక్రమించినది. దేశీయ గుజరాతీ భాషలో అందమైన చిత్రములను చిత్రించడమున కీమె పెట్టినది పేరు. సందర్భమునుబట్టి ఈమె రచనలో భాష మారిపోతూ ఉంటుంది. ఆమె సాంప్రదాయిక కావ్యాలంకారములకోసము పరుగులెత్తదు. చెప్పేది తిన్నగా, చక్కగా, సున్నితముగా, కావలిస్తే దెబ్బ తగిలేటట్లు చెప్పివేస్తుంది. ఈ క్రింది ఉదాహరణమువల్ల లీలావతి రచనలను ప్రేరేపించిన మనస్తత్వము కొంత బోధపడగలదు.

"నాకు తృప్తి ఎందుకు లేదు? నా కెక్కువగా కావలసిన దేమిటి? జీవితమంటే యేమిటి? ధర్మమంటే ఏమిటి? ఎల్లప్పుడున్ను ధర్మము నాచరిస్తూ ఉండడమువల్ల ప్రయోజన మేమిటి? ......... ఈ పక్షు లంతమధురముగా ఎవరికోసము పాడుతున్నవి ? ఈ కాంత్యుజ్జ్వలమైన ప్రకృతి సౌందర్య మెవరికోసము? ......... నేను తిరుగుతూఉన్న దారులలో ఆధునిక శృంగార పురుషు డొక్కడున్ను కనబడడు. ఈ సందులన్నీ నాకోసమే. నే నొక క్రొత్త సాహసమును చేయవలెనని నామనస్సు నన్ను ప్రేరేపిస్తున్నది. ఈరీతిగా ఒంటరిగా సంచరించే సాహసికు లెవ్వరున్ను ఉండరు. నే నిట్లు తిరుగుతున్నానని తెలుస్తే ఇతరు లేమనుకొంటారు?"

అనేక సమయాలలో నాకు స్వర్గముకంటె నరకమే మేలనిపిస్తుంది.........స్వర్గములో మంచి స్వప్నములను కనవచ్చును. కాని, అక్కడ దుఃఖము లేకపోవడముచేత

సుఖము వ్యర్థమవుతుంది. అక్కడ ఎప్పుడున్నా వెలుతురే. అందుచేత చీకటిలో అణగి ఉండే ఉగ్రత్వము లక్కడ గోచరింపవు......నరకము సంగతి వేరు. అక్కడ ప్రతిదినమున్నూ బాధపడడానికి సిద్ధముగా ఉండవలెను. క్షణ క్షణమును కలుగగల పోరాటములో పాల్గొనడానికి చురుకుగా ఎదురు చూస్తూ ఉండవలెను......అక్కడ దినదినమును నీశక్తులకు నైశిత్యము కలుగుతుంది; నీలో ఉన్న శక్తులు నీకు బోధపడుతవి. అక్కడ జీవించి నీ తత్త్వమును తెలుసుకోవచ్చును రోకటిపాటగా చప్పగా బ్రతికి తుదకు ఎవ్వరున్నూ హర్షించని చావు చచ్చిపోనక్కరలేదు."

"మగవారు క్రూరులు, వారికి స్త్రీ హృదయ మెప్పుడు తెలిసినది? అయినా, తమ కధికార మున్నట్లు ఆమె ప్రేమను కోరుతారు......వారి జీవితాశయముల... పాల్గొనడానికి కాదు వారు పెండ్లి చేసుకోవడము. తమ అభిలాషమున కాహుతి కావడానికి నిర్జీవ ప్రతిమలే వారికి కావలసినది... మగవా రాడువారి నెల్లప్పుడున్నూ తక్కువ అంతస్థులో ఉన్న వారినిగానే చూచినారు. రామచంద్రుడు పతి ధర్మముకంటె రాజధర్మము ఎక్కువగా తలచినాడు. ధర్మరాజు తనభార్య మానముకంటె ద్యూతధర్మము నెక్కువగా ఎంచినాడు. స్త్రీలుపురుషుల కామమును తీర్చడానికి మాత్ర ముపయోగించే వస్తువులని మనువు చెప్పినాడు. స్మృతికర్త లందరున్నూ స్త్రీలు పురుషుల అధీనములో ఉండవలసిన వారన్నారు. నీతి బోధకులు స్త్రీలు పురుషులను తమ వలలో వేసుకొనే

టక్కరు లన్నారు. ఇంకేమున్నది? ఆడది అంటే వినయ విధేయతలు చూపవలసిన బానిస; మగవాడు పాదములతో త్రొక్కే ధూళి...... ఇంత చేసినా స్త్రీ పురుషుని హృదయ పూర్వకముగా ప్రేమిస్తుంది."

"రేపటి ప్రపంచమును మగవాడొక్కడే సృష్టిచేయ జాలడు; ఆడది కూడా ఒక్కతే సృష్టిచేయ జాలదు. ఆసృష్టి స్త్రీత్వ పుంస్త్వ సమ్మేళనమువల్ల ఏర్పడబోయే క్రొత్త శక్తి వల్ల కలుగబోతుంది."

"ప్రేమ అంటే ఏమో నీకు తెలుసును. నీ కన్నుల నుంచి వెడలి, నీ భర్తను చుట్టివేస్తూఉన్న నీ ప్రేమను గుర్తించినాను. కాని, నా ప్రేమ వేరు. నా భర్తను కన్నులతో చూచినంతమాత్రముచేత వాటికి తృప్తిలేదు. నా శరీరములోని, ఆత్మలోను ప్రతి అణువున్ను అతనిలో లీనమై, అతనిలో భాగమై ఉండవలెనని కోరుతున్నది. కాముకులు తాము ప్రేమించినవారిలో భాగములుగా ఉండవలెనని ఉవ్విళ్ళూరుతారు. కాని, నేనుపోయి అతనిలో జీర్ణమైనప్పుడే నా ప్రేమకు నిర్వాణము కలుగుతుంది. అతనినుంచి ప్రత్యేకముగా బయట వెలిగే జ్యోతిగా ఉండడము నాకిష్టములేదు. మా యిద్దరి జ్యోతులు తుదకు కలిసిపోయి, ఏకము అఖండము అయిన జ్వాలగా వెలుగవలెనని నాకోరిక. కాని, 'తుదకు' అని యెందు కనవలెను? ఇప్పుడుకూడా దానికి మొదలుగాని తుది గాని కనిపించదు...... బ్రతుకులోను చావులోను కూడా అతడు నా అండనిలిచి నన్ను కాపాడుతాడని నాకు తెలుసును.

ఇక నేనో ? నే నతనిదాననే, నన్నతనినుండి యెవరు వేరు చేయగలరు ? మృత్యుదేవతకూడా చేయలేదు."

మతము నిర్బంధమువిూద నేర్పుతుంది; ప్రేమమూల ముగా అప్రయత్నముగా నేర్చుకోవచ్చును......కలాజీవిత మద్భుతమైనది. ప్రేమజీవనము సంపూర్ణమైనది. నేను కళ కంటిపెట్టుకొన వలసి వచ్చినది. కాని, ప్రేమకు నేను సంపూ ర్ణాధీనములో ఉన్నాను.......ప్రేమ సత్యముకంటె శాశ్వత మయినది. శాశ్వత సత్యములో అంతరములున్నవి. కాని ప్రేమ దేశ, కాలము లన్నిటిలోను ఒక్క-రీతిగా ఉంటుంది."

లీలావతి మున్షీవలె సారస్వతసేవచేస్తూఉన్న మహిళా మణులలో విద్యాగౌరీ. నీలకంఠ (జననము-1876) ప్రియమతి (లేక 'జ్యోత్స్న' జననము-1893) మొదలయిన అనేకు లున్నారు.

గుజరాతీ వాఙ్మయక్షేత్రమున నేడు కృషిచేస్తూ ఉన్న కలాకరకులు శతసంఖ్యాకముగా ఉన్నారు. వారి అందరిని గురించిన్ని తెలుపడానికి చిన్నపుస్తకములో స్థలముచాలదు. గౌరీశంకర గోవర్ధనజోషి (జననము 1892) 'ధూమకేతు' అనే మారుపేరుతో కథాలోకములో గొప్ప కలవరము కలుగ జేస్తున్నాడు. బతుభాయి లాలుభాయి ఉమర్వదియ (జననము-1899)ఏకాంకనాటికలనువ్రాసి వాసికెక్కు-తున్నాడు రమణలాల్ వసంతలాల్ దేశాయి (జననము-1892)నవలలతోను నాటకములతోను వాఙ్మయము నభివృద్ధి చేస్తున్నాడు. ఇంకా

రామనారాయణ విశ్వనాథపాఠక (జననము-1887), ధనసుఖలాల్ కృష్ణలాల్ మెహతా (జననము-1890), జ్యోతీంద్ర హరిహరశంకరదావే (జననము-1901), జవేర్ చంద్ కాలిదాస మేఘన (జననము-1897) మొదలయినవారు చక్కని కథలను హాస్యరస ప్రధానములుగా వ్రాస్తున్నారు.

---

కల్యాణీ ప్రెస్, తెనాలి.